If the number of candidates nominated exceeds the number of vacancies to be filled, namely 12, there will be an election, the date and time of which will be intimated later.

*Sri N SANJIVA REDDY:* I beg to move :

"That this House recommends to the Andhra Pradesh Legislative Council that they do agree to nominate four members from Legislative Council to be on the Committee on Subordinate Legislation of this House for a period of one year."

*Mr. SPEAKER:*—Motion moved.

**(Pause)**

*Mr. SPEAKER:* The question is:

"That this House recommends to the Andhra Pradesh Legislative Council that they do agree to nominate four members from Legislative Council to be on the Committee on Subordinate Legislation of this House for a period of one year."

The motion was adopted.

### *ADJOURNMENT MOTION Re: FAILURE OF CROPS IN AGENCY VILLAGES, POLAVARAM TALUQ.*

మిస్టర్ స్పీకర్:- గౌరవ సభ్యులు శ్రీ కోదండరామయ్యగారు రెండు వాయిదా తీర్మానాలు ఇచ్చారు. Regarding failure of crops during 1957-58 in the villages of Agency Nagaram Mutha of Polavaram Taluk, West Godavari District in general and the Girijan villages of Antharvedigudem and Ankannagudem and regarding Godavari floods of 1953 and floods occurring every year in the months of August and September. వాటిని నేను అంగీకరించుటలేదు. గోదావరి వరదలగురించి తీర్మానాల రూపంలో బడ్జెట్ లో ఎల్లప్పుడూవచ్చే విషయమేగనుక ఇప్పుడు కొత్తగా చర్చించ నవసరంలేదు. ఇక ఏజెన్సీ, నాగారంముఠా failure of crops గురించి ఒకపర్యాయం ఒకగంట discussion కు పెట్టినట్లయితే మంత్రులు సమాధానం చెప్పుదురు. ఇది adjournment motion క్రింద రాదు. ప్రభుత్వం తన విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించక పోయినప్పుడు దానిని విమర్శించుటకు adjournment motion తీసుకురావలసిఉంటుంది. ఇక్కడ అలాంటిదేమిలేదు. కాబట్టి వీటినిగురించి చర్చించుటకు ఒకసారి అవకాశమిస్తాను. కాన వీటిని అంగీకరించుటలేదు.

శ్రీ పి.కోదండరామయ్య (పోలవరం):- నేను move చేయుటలేదండి. withdraw చేసుకొంటున్నాను.

*Mr SPEAKER:* It is too late. I have already given my ruling.

శ్రీ యన్. సంజీవరెడ్డి:- ఏజెన్సీ ప్రాంతంలో అక్కడక్కడ వర్షాభావం వల్ల పంటలు పోయినమాట వాస్తవమే. ఈ విషయం రెవిన్యూమంత్రిగారు పరిశీలిస్తున్నారు. ప్రభుత్వం తగినచర్యలు తీసుకుంటుందని నేను మీద్వారా గౌరవ సభ్యులకు తెలియజేస్తున్నాను.

## ANNOUNCEMENT *Re*:- GOVERNOR'S ADDRESS

మిస్టర్ స్పీకర్: గవర్నర్‌గారి address మీద ఒక తీర్మానాన్ని Aote of thanks సమర్పించవలసిందని శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీగారు ఉపపాదిస్తారు. సవరణలు ఈవేళ మూడుగంటల లోపల ఇవ్వవలయును. There will be a general discussion on the Governor's address to-day. The amedments will be moved on the 12th vugust.

I have to acquaint the House that on the afternoon of the 9th August, 1958, the Governor has been pleased to make an Address to both Houses of Legislature of which, I had, for greater accuracy, obtained a copy, and placed it on the Table of the House, on the afternoon of the 9th August, 1958.

## MOTION ON ADDRESS BY THE GOVERNOR.

*Mr. SPEAKER* : Now Sri K. Lakshman Bapuji will move the Motion of Thanks standing in his name.

*Sri K. LAKSHMAN BAPUJI* (Chinakondur) : I beg to move :

"That an Address be presented to the Governor as follows:

"That the Members of the Andhra Pradesh Legislative Assembly assembled in this Session are deeply grateful to the Governor for the Address which he has been pleased to deliver to both the Houses of the Legislature assembled together on the 9th August 1958".

. *Mr SPEAKER :* Motion moved.

I have to announce to the House that amendments to the Motion of thanks to the Governor for his address will be received by the Secretary upto 3 p. m. today. There will be a general discussion on the Governor's address today. The amendments given notice of will be moved on the 12th August 1953.

ప్రభుత్వంయొక్క ముఖ్యమైన విధానాలను గవర్నరుగారు తమ address ద్వారా తెలియజేశారు. ప్రభుత్వంచేస్తున్న కృషివిషయం గురించికూడ తమ అభిప్రాయమును తెలుపవలసిఉన్నది. ఇంకా ఎక్కువగా కృషిచేయవలసి ఉన్నదనే అభిప్రాయం కొందరికి కలుగవచ్చు. నాకుకూడ అలాంటి అభిప్రాయమే కలిగింది. అది సహజం కూడాను. కాని ఈనాడు ప్రభుత్వం కొన్ని ముఖ్యమైనపనులు చేయుచున్నది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి):- Joint session లో గవర్నరుగారు తమ ఉపన్యాసమును ఇచ్చినట్లుగా ఉన్నది. రాష్ట్రపతికి తప్ప ఎవ్వరికి Joint session లో address చేయుటకు అధికారంలేదు.

*SRI N. SANJEEVA REDDI*: There is no joint session That was only a joint sitting of Members of both the Houses

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:- కాగితంమీద ఆవిధంగా అచ్చువేయబడిఉన్నది. కాన్స్టిట్యూషన్ ప్రకారం అదీ కరెక్టుకాదు. కనుక ఆవిధంగా ఉన్నచో point of order క్రింద rule out చేయవలసి వస్తుందని తెలియజేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:- Joint session అనేమాట చాలా లూజ్‌గా వాడబడినది. అది సెక్రెటేరియట్ పొరపాటో లేక printers' devilయో అయిఉంటుంది.

"Members of the two Houses jointly assembled'' అనిఉండాలి.

శ్రీ కె. లక్ష్మన్ బాపూజి:- గవర్నర్‌గారి address లో ఎక్కడా joint session అని వాడలేదండి.

మిస్టర్ స్పీకర్:- Speech లో లేదు. కాని కాగితంమీద ప్రింటుచేయబడినది. అదిపొరపాటు.

శ్రీ కె. లక్ష్మణ్ బాపూజీ:- గవర్నర్ గారి address ను గురించిన ప్రసంగంయొక్క ముఖ్యమైన విధానాలు చాలా తెలియచున్నవి. మనదేశంలో, ముఖ్యంగా rural areas లో ఉన్నట్టి feudal tendency ని నిర్మూలించి democratic outlook ను కల్పించుటకు ప్రభుత్వం శ్రద్ధవహించుట చాలా ముఖ్యమైనదికూడ.

ఈ feudal tendency ని తొలగించాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం and reforms కూడా చేస్తున్నది. ఇతర వర్గాల విషయాలకు సంబంధించిన సమస్య ప్రాముఖ్యత దృష్ట్యా ఏదైనా అభ్యంతరాలు ఉండటం సహజం. ఇందు విషయంలో నాకుకూడా కొన్ని సందేహాలపై భేదాభిప్రాయములు ఉన్నవి. అయినా Land Reforms, కేవలం economical point of view లో కాకుండా Political point of view తో ఆలోచించినా, చాలా అవసరంగా కనిపిస్తున్నాయి. Rural areas లో big land lordism ఒక feudal tendency ని నిర్మాణంచేసి ఉండటం చేత, అక్కడ democracy పనిచేయుటంలేదు. Democracy సరిగా నిర్వహించాలంటే ఈ feudal tendency ని eradicate చేయాలనే ఉద్దేశ్యంతోనే, మన ప్రభుత్వం Land Reforms Bill ను తీసుకరావడానికి పూనుకొంది. మన ఆశయ సాధనకు ఈ land reforms దర్శకం మాత్రమే అనే చెప్పుకోవాలి. Eradication of feudal tendency తోటే సంతృప్తి చెంది ఊరుకొనరాదు. దానిస్థానంలో democratic outlook ను గ్రామాలలో ఏర్పరచుకొనిరావడం చాలా అవసరం. ఇందుకోసం ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించి, త్వరలో గ్రామపంచాయితీ కమిటీలను అన్ని గ్రామాలలో promote చేయుటకు, special గా పంచాయితీ ఇన్స్పెక్టర్లను recruit చేసి గ్రామాల delimitation work చురుకుగా సాగిస్తున్నది. ఈనాడు urban areas లో ఉండే public తమ అవసరాల సాధనకు కేవలం ప్రభుత్వంపైనే ఆధారపడకుండాచేస్తున్నారు. This democratic government is encouraging the local self government. ఈవిధంగా Municipalities ద్వారా తమ పనులను నెరవేర్చుకొంటున్నారు. చాలా చిన్నచిన్న గ్రామావసరాలు, పరస్పర సంబంధిత గ్రామాల లో ఎక్కువగా ఉంటాయి. ఈ అన్నిగ్రామాలకు సంబంధించినవిషయం ఒక planned basis పైన జరగాలంటే, గ్రామాలలో democratic outlook వచ్చినంత మాత్రాన సరిపోదు. Co-ordination చాల అవసరం. దీనిని గమనించే National Extension Blocks లోను, Community Development Blocks లోను పంచాయితీ సమితులు ఏర్పాటుచేశారు. మొత్తం భారత దేశంపైనే మనప్రభుత్వం ఈ విషయం లో forward step తీసుకొని గొప్ప experiment చేసింది. "డెమోక్రసీ సోషలిజమ్" అని పెద్ద నినాదాలుచేసేవారు

తమకు అవకాశమున్న ప్రాంతంలో, ఈమాత్రం ధైర్యమైనా చేయలేదు. రాజకీయంగా, గ్రామాలలో రానురానుకొంటున్న Democratic outlook ఈ పంచాయతీ సమితులద్వారా నిర్మాణం అవుతుందనే విశ్వాసం నాకు ఉంది.

Urban areas లో capitalistic outlook ను నిర్మూలించే ప్రయత్నానికికూడా ప్రభుత్వం పూనుకొన్నది. దానిలో ముఖ్యమైనదిగా Nationalisation of Road Transport లో Capitalists బస్సులు పెట్టుకొని Road Transport ను control చేస్తూ, దానిలో పనిచేసే workers కు తక్కువ జీతాలుయిచ్చి తాము ఎక్కువలాభాలు పొందుతున్నారు. ఈ విధంగా పేరుకొని పోయిన capitalistic tendency ని నిర్మూలించడానికే Nationalisation of Road Transport చాలా ఉపయోగపడుతున్నది. ఆంధ్ర ప్రాంతంలో రెండు స్థలాలలో ఈ nationalisation జరిగింది. కాని దీనియొక్క ప్రభావం వల్ల మొత్తం ఆంధ్రప్రాంతంలోని capitalists అందరు తమ, తమ దృక్పథాలను మార్చుకోవలసిన సమయం ఆసన్నమైనదని గుర్తెరిగి, కాలానుగుణ్యంగా ప్రవర్తించుకోవాలనే భావం వారిలో create అయింది. యిది చాలా గొప్ప ప్రభుత్వ progressive step.

అదేవిధంగా replacement of excise contractors by Tappers Co-operative Societies కు కూడా ప్రభుత్వం అంగీకరించింది ఈమాదిరిగానే P. W. D. Contracts లో Labour Co-operative Societies ను encourage చేయాలనే ఉద్దేశ్యంతో కొద్దిగా form చేయబడ్డాయి. వీటికి reasonable costing పైన contracts యివ్వబడుతున్నాయి. ఆవిధంగా P.W.D. Contracts నుంచి contractors క్రమేణా తొలగించబడుతున్నారు. ఈ పద్ధతి erstwhile Hyderabad State లో అమలులోఉండెను. ఆపద్ధతినే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తప్పక వ్యాపింపజేస్తుందనే విశ్వాసం నాకుఉంది. అదేవిధంగా Forest contractors చాలామందిఉన్నారు. వీరిలో కూడా capitalistic tendency చాలా పెరిగిఉంది పారిశ్రామిక రంగములోనూ యిదే పరిస్థితి ఉంది. పరిశ్రమలను క్రమంగా Nationalisation ద్వారా, labour ను encourage చేసివారికి పరిశ్రమలలో సమాన హక్కులు ఇస్తూ అక్కడ గూడ ఈ Capitalistic tendency ని క్రమంగా తగ్గించే ప్రయత్నాలు చేయవలసి ఉన్నది.

మన ఆంధ్రప్రదేశ్ వ్యవసాయికరాష్ట్రమని పేరు పొందింది. దీనిని Industrial Stateగా చేయవలసిఉన్నది. ఆవిధంగా చేసిన రోజున ఆంధ్రప్రదేశ్ కే కాకుండా మొత్తం భారతదేశానికి చాలా మేలుకలుగుతుంది. పరిశ్రమలవిషయంలో- క్రొత్తగా Sugarfactories ను మన Andhra Pradesh లో Promote చేయాలనే

ప్రయత్నానికి ప్రభుత్వంకూడా చాలా తోడ్పడుతోంది. అదేవిధంగా మనరాష్ట్రంలో Cement factories ను అభివృద్ధి చేయడానికి, మరియు నూతన ఫ్యాక్టరీలను మనరాష్ట్రంలో ఏర్పాటు చేయడానికి గవర్నమెంటు encourage చేస్తూవుంది. Fertilisers factoryని కూడా establish చేయాలని ప్రభుత్వం పని చేస్తోంది. వేరేపరిశ్రమలకు అనగా Iron-ore, Manganese, Steel Plant మొదలగువాటికి కూడా పెద్ద అవకాశాలు మన రాష్ట్రంలో ఉన్నాయి. ఈ విషయంలో కూడా ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తుందని నావిశ్వాసం. నేటికాలంలో పరిశ్రముల ప్రాధాన్యతను గుర్తించి, ఆంధ్ర ప్రదేశ్ ను Industrial State గా చేయాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం కృషిచేస్తున్నందుకు నిజంగా ప్రశంసించాలి. మన ఆంధ్రప్రదేశ్ కేవలం Agricultural State మాత్రమే కాకుండా Industrial State అని కూడా అనిపించుకొనగలదనే విశ్వాసం నాకు కలుగుతోంది. "Disparity in the economic position of the Public" ని తగ్గించడానికి ప్రభుత్వము కృషిచేస్తున్నది. భూసంస్కరణలవలన రూరల్ ఏరియాలలో ఈ disparity తగ్గుతుందనే విశ్వాసము నాకు ఉంది.

Cottage and small scale industries పైన ఆధారపడి ఉన్న వారి ఆర్థిక పరిస్థితులు చాలా హీనముగా ఉన్నవి. వాటిని కో-ఆపరేటివ్ సొసైటీ స్థాపనద్వారా తీర్చాలనే అభిప్రాయం ప్రభుత్వమునకు ఉంది దానివలన సామాన్య ప్రజానీకము యొక్క ఆర్థిక పరిస్థితి ఎక్కువబడుతుందని నేను విశ్వసిస్తున్నాను

రోడ్డు ట్రాన్సుపోర్టు విషయములో, దానిలో పనిచేస్తున్న ఉద్యోగుల జీతములు, సౌకర్యములు ముందు చాలా తక్కువగా ఉండేవి. కాని దానిని నేషనలైజ్ చేసినతర్వాత వారి scales of pay ను పెంచటం, low income వచ్చేవారి జీతాలను పెంచటం జరిగింది. ఈనాడు కూడ మన ప్రభుత్వము అదే పాలసీని అనుసరిస్తున్నది.

'Wages increase in public and private sector' అనే విషయములో low income వారికి జీతాలు పెంచబడ్డాయని గవర్నరు గారి ప్రసంగములో ఉంది. హనుమంతరావు కమిటి సిఫార్సులను గురించి మన ప్రభుత్వము Favourable decision తీసుకొన్నట్లు, బ్రహ్మానందరెడ్డి కమిటిని ఏర్పాటుచేసినట్లుకూడా గవర్నరు గారి ప్రసంగంలో వున్నది. వారి సిఫార్సులనుబట్టి తక్కువ ఆదాయము కలవారి జీతాలను పెంచటంవలన ప్రభుత్వమునకు సుమారు 2 కోట్లరూపాయలు ఖర్చు అధికంగా అవుతుందని కూడా వారు చెప్పారు. చిన్న ఉద్యోగస్తుల జీతాలను పెంచాలనే ప్రభుత్వము ఆలోచిస్తున్నది. పూర్వపు హైదరాబాదు రాష్ట్రములో పెద్ద scales వుండేవి. ఇక ఇప్పుడు వారు పై ఉద్యోగములోనికి

వెళ్లిన ఆంధ్ర స్కేలు ఇవ్వబడుతుంది కనుక disparity in salaries కొంతతగ్గుతుంది. అందరిని సమానంచేయాలనే పాలసీతోనే ప్రభుత్వము పరిపాలన సాగిస్తున్నది.

గ్రామములలోని బీదప్రజలు ధనసహాయములభించక చాలాబాధపడుతున్నారు. పెట్టుబడిదార్ల వడ్డీబాధలకు వారు గురిఅవుతున్నారు. వాటిని నిర్మూలించటానికి Credit Co-operative Societies ను ఏర్పాటుచేసి, రిజర్వుబ్యాంకు వారికి గ్యారెంటి ఇచ్చి డబ్బుసొసైటీల ద్వారా బీదప్రజలకు అప్పుగా యిప్పించుటకు ప్రభుత్వము ప్రయత్నము చేయుచున్నది.

షెడ్యూల్డ్ క్యాస్టు, షెడ్యూల్డ్ట్రైబ్సు మిగతా వెనుకబడిన వర్గాలవారికి ఉద్యోగాలలో ప్రత్యేక స్థానములు కేటాయింపబడినవి. వాటిని అమలువరచటములో ఏమైనా పొరపాట్లు జరుగుచున్నట్లుఅయితే వాటిని అరికట్టటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందని ఆశిస్తున్నాను. ఈ విషయముగురించి గవర్నరుగారు తమ ప్రసంగములో మరికొంత వివరించి ఉంటే బాగుండేది. సరిగా అమలు జరుగకపోతే అసలు ఉద్దేశ్యమే దెబ్బతింటుంది.

విద్యలో disparity ని తొలగించాలనే ఉద్దేశ్యము ప్రభుత్వమునకు ఉంది. వెనుకబడిన వర్గాలవారికి ప్రత్యేకముగా సీట్లు రిజర్వుచేయబడుతున్నవి. రిజర్వేషన్ ద్వారా వారికి విద్యా సౌకర్యాలను కల్గించటానికి ప్రభుత్వము కృషిచేస్తున్నది. ఆంధ్రలో వలె 25 % అనే ప్రొవిజన్ తెలంగాణలోకూడా అమలువరచటానికి మన ప్రభుత్వము నిర్ణయించినది. గాని implementation విషయంలో చాలా పొరపాట్లు జరుగుతున్నాయని ప్రభుత్వదృష్టికి తేబడింది. దానిని గురించి ఇకముందు ప్రభుత్వము శ్రద్ధ వహిస్తుందని నేను ఆశిస్తున్నాను.

స్కాలర్ షిప్స్ ద్వారా బీద ప్రజలకు విద్యాసౌకర్యాలు కలుగచేయుటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. దానికొరకు individual గా కూడా ఈ స్కాలర్ షిప్స్‌లను ఇవ్వటానికి భారత ప్రభుత్వము, మన ప్రభుత్వము కూడా ప్రయత్నిస్తున్నవి. కాస్మోపాలిటన్ హాస్టల్స్‌ను నడపటానికి గూడా మన ప్రభుత్వము పూనుకొంటున్నది. డబ్బు లేనివారికి చదువుకొనే అవకాశములు కల్పించటానికి గాను ఈ హాస్టల్స్ నడుప బడుతున్నవి. దీనివల్ల disparity తగ్గిపోతుంది. కాని ఈ ప్రయత్నములు Executive side లో దెబ్బతినిపోకుండా ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని మనవి చేస్తున్నాను. హరిజనులు General schools లోనికే వెళ్లాలి. వారికి వేరేపాఠశాలలు ఉండకూడదనే ఇండియా ప్రభుత్వం వారి విధానాన్ని ఖచ్చితంగా అమలు జరిపినందువల్ల విద్యావిషయాలలో కూడా మొత్తం మీద discrimination పోయి parity ఏర్పడుతుందని భావిస్తున్నాను. Educational field లో parity ఇప్పటి

discrimination differences తగ్గించాలనే ఉద్దేశంతో తగుప్రయత్నాలు ప్రభుత్వం జేయాలని కోరుతున్నాను. ఇక Social welfare విషయం, general uplift సమస్య ముఖ్యమైనది. ఈ ఉద్దేశంతోనే ఆసుపత్రులలో కొన్నివందల beds ఎక్కువ చేయబడ్డాయి. ఆసుపత్రిలలో ఎక్కువడాక్టర్లు ఉండాలనే అభిప్రాయంతోనే క్రొత్త మెడికల్ కాలేజీలుకూడా ప్రారంభింపబడుతున్నాయి. ఇంతఖర్చు పెట్టిన తరువాత కూడా ఈ కాలేజీలలో విద్య నేర్చుకున్న డాక్టర్లు rural areas కు ఉపయోగపడడంలేదు. గ్రామాలకు వెళ్లడానికి వారు సిద్ధంగా లేరు. అక్కడ వారికి attraction లేదని ఇదివరకు ముఖ్యమంత్రిగారు ఎన్నోసార్లు శాసనసభలో చెప్పారు. వారికి attraction కలిగే పరిస్థితి ఎన్ని సంవత్సరాలకు వస్తుందో తెలియదు. గ్రామాలనుంచి వచ్చే ఆదాయంలో నుంచి పెద్ద మొత్తాలు ఖర్చుచేసి మెడికల్ కాలేజిలలో విద్యను చెప్పించిన తరువాత వారిసేవ rural areas కు కలుగకపోతే న్యాయం కాదు. ప్రభుత్వం ఈ విషయంలో ఖచ్చితమైన పద్ధతి అమలుజరుపాలని కోరుతున్నాను. మెడికల్ కాలేజీలలో ప్యాసైన ప్రతి విద్యార్థి విధిగా తప్పనిసరిగా కొన్నిసంవత్సరాలైనా Rural Areas లో పనిచేయాలనే నియమం పెడితే బాగుంటుంది. లేకపోతే Social Welfare అనేది urban areas కు మాత్రమే ఉండిపోతుంది. Rural Areas కు చేరడానికి చాలకాలం పడుతుంది. అలోపతి వైద్యంవిషయంలోనే కాక ఆయుర్వేదం విషయంతో కూడా ఎక్కువ శ్రద్ధ వహించవలసి ఉంటుంది అని అనుకుంటాను. ముఖ్యమంత్రిగారు తమ ఉపన్యాసంలోనైనా ప్రత్యేకశ్రద్ధ వహించే విషయమై ప్రభుత్వవైఖరి తెలిపితే నేను సంతోషిస్తాను. ఆరోగ్యదృష్టితో Health Centres చాలా పెంచుతున్నారు. అంతే కాకుండా Social welfare కు సంబంధించిన ఇతర activities అంటే సాహిత్య, నాటక ఎకాడమీలు స్థాపించి, వాటి విషయమై ప్రత్యేకశ్రద్ధ ప్రభుత్వం తీసుకుంటున్నది. గ్రామాలలోను, పట్టణాలలోను వీధులలో దీపాలు లేనిచోట్ల విద్యుచ్ఛక్తి ఇచ్చే ఏర్పాట్లు చేస్తున్నారు. ఇదంతా కూడా broad view తో చూస్తే social welfareకు సంబంధించిన విషయమే అనుకోవలసి వస్తుంది. విద్యుచ్ఛక్తి విస్తరణ చాలా కొద్దికాలంలో చాలాఎక్కువగా పెరిగింది. దీనికై ప్రత్యేకంగా డబ్బుకేటాయించి ప్రభుత్వం ప్రత్యేకమైన drive తీసుకుంటున్నది. అయినా డిమాండుకు తగినట్లు అందడం లేదని complaints వస్తున్నాయి. Staff తక్కువ కావచ్చును. ఇంకా ఎక్కువ చేయడానికి అవకాశాలు లేకపోవచ్చును. Scope ఉన్నంతవరకైనా సక్రమంగా implementation జరిగితే ప్రయోజనం బాగాఉంటుందని ఆశిస్తున్నాను. Housing సమస్య విషయమై చాలా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ విషయమై fundamental గా తిరిగి ఆలోచించాలని కోరుతున్నాను. ఇది చాలా గొప్ప స్కీము. Welfare State గా మారడా

నికి ఈస్కీమునకు తగు ప్రోత్సాహం ఇవ్వవలసిందే. Small scale housing scheme అనే పేరుతో 8 వేలవరకు డబ్బు యివ్వాలి. గ్రామాలలో రెండు వేలవరకు ఇచ్చిన మంచి ఇల్లు తయారు అవుతుంది. అక్కడ ఉండడానికి ఇల్లు లేకుండా ఎన్నో కుటుంబాలున్నాయి. Housing schemes పట్టణాలలో మాత్రమే ప్రోత్సాహము యివ్వబడినది. గ్రామసీమల విషయంలో కూడా భారత ప్రభుత్వం వారు యిందు గురించి కొంత డబ్బు ప్రత్యేకించారు. ఏదో ఒక planned basis మీద పేదకుటుంబాలకు ఈ స్కీముల ద్వారా డబ్బుసహాయం చేసి గ్రామసీములలో ఇండ్లు కట్టడం అయ్యేటట్లు చూస్తే Welfare state అనిపించుకొనుటకు మంచి స్థితి వస్తుంది అని నా అభిప్రాయము. పాల సప్లయి విషయంలో కూడ ఇటీవలనే ఒక పెద్ద స్కీము నిర్ణయించ బడ్డది. ఇది అమలు లోనికివస్తే urban areas వారికి చాల సౌకర్యం కలుగుతుందని అనవలసి ఉంటుంది. ఇంత పెద్ద పట్టణములో ఈ సౌకర్యం లేక పోవడం ప్రజలకు చాలా కష్టతరమని ప్రభుత్వం భావించినందుకు ప్రశంసించవలసి ఉన్నది. Flood control drive విషయమై గవర్నరుగారు తమ ఉపన్యాసములో పేర్కొన్నారు. తద్వారా సమాజానికి జరిగే హాని, నష్టం అరికట్టవచ్చునని నా అభిప్రాయం. Social welfare విషయమై ఆలోచించునపుడు గమనించవలసిన మరొక ముఖ్య విషయం communal mindedness దీనిని అరికట్టడానికి anti-communal drive రూపంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలని నా అభిప్రాయం. దీనిక్రింద Social welfare Department వారు community భోజనాలు అనే పేరుతో కొంతడబ్బు ఖర్చు చేస్తున్నారు. కాని అంతమాత్రంచేత సరిపోదు. ఇంకా పెద్దఎత్తున ఈ ప్రయత్నం జరుగవలసి యున్నది. హయ్యర్ ఎడ్యుకేషన్ విషయమై కాకున్నా ప్రైమరీ విద్య విషయమై Social Welfare Department వారు శ్రద్ధ తీసికోవలసి యున్నది. ప్రతి గ్రామంలోను ప్రైమరీ స్కూలు ఉండాలని భారత ప్రభుత్వం వారు పథకం సిద్ధం చేస్తున్నట్లు తెలుస్తున్నది. ప్రభుత్వ information ప్రకారం కొన్ని వందల ప్రైమరీ స్కూల్సు తెరువబడుతున్నాయి. ఇది అంతా Welfare State నిర్మాణానికి ఉపయోగపడుతుందని నేను భావిస్తున్నాను. వ్యవసాయోత్పత్తిని (agricultural production) పెంచే విషయంలో కూడ ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నట్లు తెలుస్తున్నది. Improved methods and appliances, soil conservation, bunding మొదలైన విషయాలలో ప్రణాళికలు వేయటం మాత్రమే కాక ఉద్యోగస్థులు కూడ ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు. ఇరిగేషన్ సౌకర్యాల విషయంలో పెద్ద ఎత్తున ప్రయత్నం సాగిస్తున్నారు. తెలంగాణాలో చిన్న చెరువులు మరమ్మతు చేయాల్సినవి చాలా ఉన్నాయి. మరమ్మతులలో ఎన్నో చిక్కులు, కష్టాలున్నాయి. ఈ కష్టాలన్నీ గ్రామాలలో పోవాలంటే P.W.D. పద్ధతిలో కాకుండా ఆంధ్రప్రాంతంలో మాదిరిగా

రివెన్యూ Inspectorsచిన్న చిన్న ప్రాజెక్టులు, repairs చేసే పద్ధతి ప్రవేశ పెడితే బాగుంటుంది అనుకుంటాను. తొందరగా మరమ్మతులపని పూర్తి అవుతుందని ఆశిస్తున్నాను. తద్వారా ఉత్పత్తికూడా పెరుగగలదు.

(Sri S. Ranganatha Mudaliar was called to occupy the Chair at this stage.)

*SRI K. LAKSHMAN BAPUJI*:- On a point of order, Sir. If I am in the House, nobody else should be in the chair except the Speaker.

*MR. SPEAKER*. When you yourself are speaking like any other Member, that does not apply.

(*Sri S. Ranganatha Mudaliar in the Chair*)

శ్రీ కె. లక్ష్మణ్ బాపూజీ: చిన్న ప్రాజెక్టులు మరమ్మతులు చేసే విషయమై ప్రత్యేక శ్రద్ధ వహించవలసి యున్నది. చాలాకాలంనుంచి చెరువులు ఉపకరించే పద్ధతిలో లేవు. వాటిని ఎంత తొందరలో మరమ్మతు చేస్తే అంత మంచిది. ఈ విషయంలో కూడా ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తుందని ఆశిస్తున్నాను. వ్యవసాయోత్పత్తి వృద్ధిచేయాలనే ఉద్దేశంతోనే tenants' rights ప్రభుత్వం ఖచ్చితంగా ఒప్పుకుని వారి హక్కులను కాపాడాలనే వైఖరి అవలంబించింది. అక్కడక్కడ కొన్ని కష్టాలు వస్తున్నాయి. అమలుపరచడంలో కొన్ని ఇబ్బందులు వస్తున్నాయి. Tenants హక్కులను ఉద్యోగులు సరిగా కాపాడడం లేదని కొన్ని సందర్భాలలో మన దృష్టికి వచ్చుచున్నది. వారి హక్కులను రక్షించడం ప్రభుత్వ విధ్యుక్త ధర్మం. వ్యవసాయోత్పత్తిని పెంచే ఉద్దేశ్యంతోనే భూసంస్కరణలు లేబడినాయి. చిన్న చిన్న lanl holders ను సహకార పద్ధతిపై Co-operativefield లోనికి తెచ్చి ఉత్పత్తిని వృద్ధిచేయాలనే ఉద్దేశం కూడా ఉన్నది. ఇవన్నీ ఉత్పత్తిని వృద్ధిచేసే steps అని అనుకోవచ్చును.

ఇక Industries విషయములో production ఎక్కువ చేసే ప్రయత్నములు జరుగుచున్నవనే చెప్పవలసి వుంటుంది. ముఖ్యముగా ప్రభుత్వము తీసుకున్న శ్రద్ధ మూలముగా sugar production ఎక్కువగా పెరిగినది. బోధన్ sugar factory administration లో యున్న లోపాలు సరిదిద్ద బడిన తరువాత యీమార్పు గమనింప దగినది. సుమారు 40 లక్షలు నుండి 60 లక్షలు వరకు turnover లో పెరిగి నట్లు తెలుస్తున్నది. అదేమోస్తరుగా క్రొత్తగా sugar factories ను start చేయడము ద్వారాను, cement factories ను ఎక్కువ చేయడము ద్వారాను యీ production ఎక్కువ చేయాలనేదే ప్రభు

త్వమువారి policy అయి వున్నది. Law and order విషయము ఆలోచిస్తే మన రాష్ట్రములో law and order చాలావరకు సరిగానే maintain చేయ బడుతున్నగనే చెప్పుకోవలసి వుంటుంది. యిటీవల కొంత కాలముగా ఉత్తర రాష్ట్రములో అనేకరకములుగా శాంతికి భంగము కలిగి వున్నది. కాని మన రాష్ట్రములో శాంతి భద్రతలు సరిగా చూడబడుచున్నవి. ముఖ్యముగా law and order కు సంబంధించినంతవరకు courts ముఖ్యమైన ఆధారము. తెలంగాణాలో ప్రస్తుతము executive and judiciary విడిగా వున్నవి. దీనిని ఆంధ్ర ప్రాంతానికి వర్తింప జేసినారు. అందుచేత యిది ప్రజల హక్కులను సంరక్షించడానికి తీసుకున్నటువంటి ఒక అభివృద్ధి చర్య అని చెప్పాలి. గాని విచారకర విషయమేమంటే ఒకవైపు అటువంటి పద్ధతిని అవలంబిస్తూ వేరొకవైపు తెలంగాణా ప్రాంతంలో Collectors, Deputy collectors కు judicial powers grant చేస్తున్నారు. యిది నాకు అర్థము కాలేదు. యీ policy చాలా contradicting గా వున్నది. కాబట్టి ప్రభుత్వము దీనిని గమనించవలసి వుంది. తెలంగాణాలో executive ను judiciary నుంచి separate చేసినారు, కాబట్టి Collectors కు judicial power grant చేయడమనే ప్రసక్తి రాకూడదు. Courts విషయములో తెలంగాణా పద్ధతులు ఆంధ్రకు కొన్ని వర్తింప చేయబడినవి. అలాగుననే ఆంధ్రంలో నున్న కొన్ని పద్ధతులు తెలంగాణాకు వర్తింప చేయబడినవి. యిన్ని మార్పులను చేసిన courts లో చాలా అధికముగా cases pending లో వుండి పోవుచున్నవి. కొన్ని కోర్టులలో Magistrates యొక్క jurisdiction తెలియక, మరికొన్ని కోర్టులలో ఏయే జడ్జిలకు ఏయే powers వున్నవో తెలియక తికమక పడుతూ చాలా బాధలకు గురి అవుతున్నారు. దీని వలన law and order maintenance ఎప్పుడు తీవ్ర రూపము దాల్చి, ఎప్పుడు శాంతి భద్రతలకు భంగము కలుగుతుందో ఊహించలేని పరిస్థితులు కలిగి వున్నవి. అందుచేత ప్రభుత్వము వారు యీ విషయములో ప్రత్యేక శ్రద్ధ వహించి తొందరగా order ను జారీ చేస్తారని విశ్వసిస్తున్నాను. గవర్నరుగారు యింకా కొన్ని ముఖ్య విషయములను తమ ప్రసంగంలో పేర్కొనవలసి వుండెను. తరతరాల నుంచి అనగా బ్రిటిషు వారి కాలము నుంచి administrative machinery బ్యూరోక్రాటిక్ పద్ధతిలోనే జరుపబడుచున్నదని చాలాసార్లు మంత్రులు చెప్పినారు. అందుచేత యీ administrative machinery మార్పు విషయములో ప్రభుత్వము యేమి చర్య తీసుకోనున్నది గవర్నరుగారు పేర్కొనలేదు. ముఖ్య మంత్రిగారు యీ విషయము సెలవిస్తారని నా అభిప్రాయము. అట్లే గ్రామాలలో యిప్పుడున్న feudalistic tendency ను తగ్గించి democractic outlook

ఎక్కువ చేద్దామనే ప్రయత్నము ప్రభుత్వము యొక్క policy గా చెప్పబడెను గాని వతన్‌దారి అనగా తెలుగులో village officers కు hereditary rights ఉంచడము యింకా జారీవుంచ బడినది. అది న్యాయ విరుద్ధమని చెప్పక తప్పదు. అందుచేత యీ system ను abolish చేస్తారని యీ విషయములో ప్రభుత్వము యితోధిక శ్రద్ధవహిస్తుందని నేను ఆశిస్తున్నాను. అప్పుడే గ్రామసీమలలో buracratic setup పూర్తిగా లేకుండా పోగలదని నావిశ్వాసము. Statewide గా ఆలోచిస్తే British వారి టైములో నున్న administrative rules, procedures యింకా వున్నవి. ఒక ఆఫీసరు వుంటే, వారికి యున్న చిన్న వుద్యోగస్థులు తమ పాదరక్షలు కూడా విడిచి, ఎంతో అడకువతో నిలబడ వలసి వస్తున్నది. ఈ buracratic outlook British వారి regime లో నున్నటువంటి అలవాటు ప్రకారము యింకా కొనసాగించ బడుచున్నది. యిట్టి పద్ధతులను తొలగించినప్పుడే ప్రభుత్వ యంత్రాంగము democratic పద్ధతిపై నడుస్తున్నదని చెప్పవచ్చును. యీ విషయములో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధ వహిస్తుందనే నావిశ్వాసము. ముఖ్య మంత్రిగారు యీ విషయములో సరియైన పద్ధతిఅవలంబించి, ప్రభుత్వ దృక్పధమును తెలియపరిచెదరని నేను ఆశిస్తున్నాను గవర్నరుగారు తమ ప్రసంగములో యీవిషయమును గురించిచెప్పితే చాలాబాగుండెడిది. తరువాత Anti-corruption Department అని ఒక శాఖ ప్రభుత్వములో ఉన్నది. ఈ విషయములో కూడ గవర్నరుగారు ఏమియు తమ ప్రసంగంలో పేర్కొనలేదు. కేవలము ఆఫీసులో ఉండె corruption తగ్గించేవుద్దేశ్యముతో ప్రభుత్వమువారు tribunal-ను కూడ separate గా యేర్పరచారు. ఈ corruption cases ఈ tribunals కు మాత్రమే పంపబడుతాయి. Special Branch అని మరొక శాఖకూడా ఉన్నది. ఆశాఖ నిర్వహణ గురించి గూడ గవర్నరుగారు తమ ప్రసంగములో ప్రస్తావించ లేదు. ఈ విషయములోకూడ ప్రభుత్వము తమ విధానాన్ని తెలియజేయవలెనని నాఅభిప్రాయము. ఒకచాలా ముఖ్యమైన పాలసీసమస్య అనగా ,,రాష్ట్రభాష'' విషయం గవర్నరుగారి ప్రసంగములో ప్రస్తావించబడలేదు. Telugu ను state language గా చేయబోతున్నారా ? అసలు ఆ ఉద్దేశ్యము ఉందా ? లేదా ? యీ విషయములు ప్రభుత్వము వారు తెలుప వలసింది. ఇది చాలా burning problem గాన యీ విషయాన్ని మాత్రము నిర్లక్ష్యం చేయడానికి వీలు ఉండకూడదు. Urdu ను ఒక language గా ప్రభుత్వము secognise చేయడము చాలా ప్రశంసనీయమైన విషయము అని చెప్పక తప్పదు ఈ విధముగానే anti communal drive గురించి ప్రత్యేకముగా చెప్పబడలేదు. ఈ communal feelings ఉండటము వలన దేశానికి యీవేళ చాలా నష్టము వాటిల్లుచున్నది. ఈ communal feelings లేకుండా చేయాలంటే

దానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకొనవలసి ఉంటుంది. ఈ communal feelings ను తొలగించడానికి Inter-Caste Marriages Act ఉన్నంత మాత్రాన సరిపోదు. ఈ inter-caste marriages ను చేసుకొనదలచే వారికి ప్రభుత్వము ధన సహాయము చేస్తే కొంతవరకు బాగుంటుంది. Inter-caste marriages ను encourage చేసినంత మాత్రముచేత ఈ communal feelings ను నిర్మూలించడానికి వీలుపడదు. మరియు ప్రభుత్వము అనుసరించే గద్ధతులలోను వైఖరిలోను "above communal" అనే దృక్పథమును కనుబరచనిదే దేశములో నున్న యీ feeling తొలగుట కష్టము. ఈ communal feelings నాయకులలోకూడా వుండటము విచారకరమైన విషయము. Leaders అంటే advanced గా వున్నవారే leaders. వారేఈ communal feeling తెచ్చుకొని down trodden sectionsలో communal feelings ఉన్నాయనడము సరిగాదు. తరతరాలనుండి అభ్యుదయవర్గాలు సమాజమును కులవర్గాలుగా దీర్చిపెట్టారు. వాటి పునాదులు యింకా గట్టిగాఉన్నాయి. ఎక్కడయినా economic problems వుంటే communal basis మీద organise చేస్తారు. ఉదాహరణకు కొన్ని co-operative soceities లో కులతత్వము పూర్తిగా ఉన్నది. ఈ కులతత్వముల పద్ధతులపై education facilities కొన్ని Backward communities కు Backward classes కు యివ్వబడినవి. ప్రభుత్వము యీవిషయములో ఒక ఖచ్చితమైన policy ని adopt చేసి యీపద్ధతిని నిర్మూలించవలసి ఉంటుంది. కొంత అనుభవము తర్వాత భారతదేశములో యీ కులతత్వములను నిర్మూలించి Backward sections ను నూతన పునాదులపైన ఆలోచించాలని అంటున్నారు. ఆ అభిప్రాయం చాలా మంచిదే. ప్రభుత్వము యీ విషయములో ఒక policy ని adopt చేసుకొని అన్నివర్గముల వారికి సమాన అవకాశాలు కల్పించాలి. కుల తత్వ పద్ధతిలో గాక యితరత్రా యేపద్ధతి నైనా అవలంబించినచో యీ backward sections కు సరియైన సౌకర్యములు కలిగించేటటువంటి మార్గాలు చూపెట్టితే దానిని నేను మొట్ట మొదటసారిగా బలపరచగలను. కులాల పేరుతో యేమనీ జరుగకూడదు. ఈవిషయముగూర్చి గవర్నరుగారు తమ ప్రసంగములో, ప్రస్తావించవలసి యుండెను. ఇక, తెలంగాణా Services విషయములో ఉన్న అసంతృప్తిని దూరము చేసేకొరకు ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధ వహించడము సుచావహము. ఈ విషయములో రెండు కమిటీలను నియమించడము జరిగెను. భారత ప్రభుత్వము వారు ఒక special Officer ను నియమించడము కూడా జరిగెను. ఈ Officer చేసేపని ఏవిధముగా ఉన్నా psychological గా మంచి effect మాత్రము ఉంటుందని చెప్పడానికి సందేహము లేదు. ఈ services నిబంధనలు మార్పిడి కార్య నిర్వహణలో

ఏమంత ఎక్కువగా పొరపాట్లు ఉన్నాయని నేను అనుకోను.

ఆ వాతావరణాన్ని మనము change చేయాలి. కాని ఒక్క services విషయములో మాత్రమే కాదు Law. integrate చేయబడుతున్నదని చెప్పారు Law integrate చేయటానికి గాను ఒక కమిటీని ప్రత్యేకముగా ఏర్పరిచిన బాగుంటుందని నా మనవి ఆ విధముగ చేస్తే నాకు చాలా సంతోషము. ఎంతవరకు అయితే ప్రభుత్వము ఆంధ్ర తెలంగాణాల emotional integration విషయములో శ్రద్ధవహించదో అంతవరకు education, law integration, services ఈ మూడు విషయములలో ఎరి కార్యములు తోటి సరియైన emotional integration కాదు అనే విషయము అర్థము చేసుకోవలసి ఉంది. ఆంధ్రలో చాలా కాలమునుంచి ఒక విధమైన administration అమలు జరుపబడుతూ ఉంది. తెలంగాణాలో ఒక విధమైన పద్ధతి అవలంబించబడుతూ ఉండెను. కావున ఆంధ్ర తెలంగాణాల విషయములలో కొన్ని భేదాలు ఉండటం సహజం. అవి నిర్మూలించాలంటే social contacts చాలా రావాలి. దానికి గాను ఆంధ్ర ప్రాంతమువారు తెలంగాణా ప్రాంతములోను, తెలంగాణా ప్రాంతమువారు ఆంధ్రప్రాంతములోను పర్యటన చేయాలి. అందుకు గాను ప్రభుత్వమువారు ప్రత్యేక సౌకర్యములు, ticket concessions ఏర్పరచి ముఖ్యమైన ప్రదేశములు తిరుగుటకు అవకాశము కల్పించవలెను. అక్కడివారు ఇక్కడకు, ఇక్కడివారు అక్కడకు తిరుగుటకు అవకాశాలు కల్పించిన బాగుంటుంది. ఇంక సర్వీసుల విషయములో ఆంధ్ర తెలంగాణా వారిద్దరిలోను కొంత understanding లేదని అనవలసి వస్తుంది. ఒకరు తాను superior ఇతరులను inferior అనుకొంటాడు. వీటన్నిటిని తొలగించుటకు మన ముఖ్యమంత్రి గారు వారి press conferences లోను, ఉపన్యాసములలోను చెప్తూనే ఉన్నారు. ఈ భేదము లేకుండా చేయుటానికి అవసర చర్యలు తీసుకోవాలని మనవిచేస్తున్నాను. ఇంతవరకు తెలిపినప్రకారం fundamental policies కు సంబంధించిన విషయాలు కొన్ని గవర్నరు గారు వారి ప్రసంగములో పేర్కొనలేదు. అయినా ఆంధ్ర ప్రదేశ్ తప్పక ఒక అభ్యుదయ రాష్ట్రముగా క్రమేణా రూపొందుతున్నదని చెప్పడానికి ఏమీ సందేహము లేదు. వేరే రాష్ట్రములతో పోల్చి చూచినయెడల మన ఆంధ్ర రాష్ట్రము ఎన్నో విషయాలలో చాల పురోగమించిందని ఒప్పుకోవలసి ఉంటుంది. ఇన్ని సమస్యలు పరిష్కారమైనా కొత్త సమస్యలు ఉత్పన్నమవుతూ వుంటవి. వాటినికూడా పరిష్కరించడానికి ప్రభుత్వము చర్యలు తీసుకోగలదని అనడానికి వీలు ఉంది. ఇంతవరకు జరిగిన అభివృద్ధిని చూస్తే మన ఆంధ్రప్రదేశ్ ఎంత

నుందంజ వేసినదో అర్థమవుతుంది. ఇలాగా ప్రభుత్వము తీసుకొనవలసిన చర్యలను గురించి నేను కొన్ని చెప్పాను. మిగిలిన సభ్యులు కూడా ఇలాగా చెపుతారు. గవర్నరుగారి ప్రసంగములంటే ప్రభుత్వ Policy అని భావించబడుతుంది. గవర్నరు గారిచ్చిన ఉపన్యాసము చాలా క్లిష్టముగా ఉండుటచే ఇంకా కొన్ని విషయములు దానిలో చేర్చబడలేదేమో. గవర్నరు గారు చెప్పని విషయాలను గురించి కూడా ముఖ్యమంత్రి గారు చెబుతారని విశ్వసిస్తాను. అది లేదని, ఇది లేదని అనుకొనడం కంటె ఉన్నదానిలో ఎంత అభివృద్ధి చెందినాము అనే విషయము చూస్తే ప్రభుత్వమును అభినందించవలసి ఉంటుంది అనే అభిప్రాయముతో ఈ తీర్మానమును ప్రవేశపెట్టినాను. అందరు సభ్యులు ఏకాభిప్రాయముతో హృదయపూర్వకముగా అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

*Mr. CHAIRMAN (Sri S. Ranganadha Mudaliar)*: Hon Sri S K V. Krishnavatharam will second the motion, now.

*Sri P. VENKATA SUBBAYYA* (Rajampet - Reserved) : Sir, the hon. Leader of the House has asked me to second the motion.

*Mr. CHAIRMAN:* The hon Leader of the House is not here now. So, hon. Sri. S.K.V. Krishnavatharam will second it-

*Sri N. VENKIAH* (Addenki) : On a point of order, sir.

డిప్యూటీ స్పీకరు గారు సభలో ఉండగా మరొకరు అధ్యక్షస్థానములో ఉండి సభాకార్యక్రమము జరుపవచ్చునా?

*Mr. CHAIRMAN*: I have no objection if the hon. Deputy Speaker is going to take the seat. Until he comes, I will be in the Chair. (Pause)

*(Mr. Deputy Speaker in the Chair)*

**మిస్టర్ డిప్యూటీ స్పీకర్ :—** ఈ resolution నేనే move చేశాను కనుక దానిని second చేసేటప్పుడు వేరేవారు కుర్చీలో ఉండుట మంచిదని నేను అనుకొంటాను.

*(Srimathi. T. Lakshmi Kanthamma in the Chair)*

**శ్రీ ఎన్. వెంకయ్య:** ఇదివరకు జరిగిన కార్యక్రమమునుయొక్క ఉద్దేశ్య మేమిటో తెలియజేస్తారా? Deputy Speaker గారు బలపరచిన తీర్మానాన్ని బలపరుచుటకు గాను కృష్ణావతారం గారు ఉపన్యాసము ప్రారంభించబోయారు. తాము అధ్యక్షస్థానాన్ని అలంకరించారు. ఈ మధ్యకాలములో జరిగినది ఏమిటో చెపుతారా?

*Mr. CHAIRMAN*: The hon. Speaker has already said that

hon. Sri S. K. V. Krishnavatharam will second the Motion. I request hon. Sri Krishnavatharam to please second the Motion.

**శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారం :-** (తాడేపల్లిగూడెం-జనరల్) గవర్నరుగారు ఉభయసభల సమిష్టిసమావేశములో యిచ్చిన ప్రసంగానికి అభినందనతీర్మానాన్ని మిత్రులు కొండా లక్ష్మణ్ గారు తీసుకొనివచ్చారు. ఆ తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను. సామాన్యముగా గవర్నరుగారి address సంవత్సరానికి ఒకసారి అయినా మొదట ఏర్పాటు అయింది. ఆంధ్రప్రదేశ్ వచ్చి సుమారు రెండుసంవత్సరములు అయినది. రెండుసంవత్సరములకు ఇప్పుడు గవర్నరుగారు ప్రప్రథమ ఉపన్యాసాన్ని ఇచ్చారు. వారి ప్రసంగములో జరిగిపోయిన కార్యక్రమములగురించి చాలవుట్టుకుఉంది. అమెరికన్ ప్రెసిడెంటుకూడా తమ కార్యక్రమాలను గురించి, పథకాలనుగురించి 6 నెలలకు ఒకసారి, ముందుగానే ఒక Message పంపే ఆచారముఉంది. ఏ మనకు ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు వచ్చిన రెండుసంవత్సరములకు గవర్నరుగారు ప్రప్రథమము ప్రసంగము చేయుడము జరిగింది. గవర్నరుగారు జరిగిన కార్యక్రమాలనుగురించి పేర్కొన్నారు. వాటికి సంతృప్తి కలుగుతున్నది. కాని ముందు చేయబోవు కార్యక్రమాలనుగురించి, శాసనాలనుగురించి వారు తమ ప్రసంగములో పేర్కొనలేదు. ఆ లోపము ఇచ్చట కనపడుతున్నది.

ఈ ప్రసంగములో చాలముఖ్యమైనవిషయం భూసంస్కరణలకు సంబంధించినది. ఈ సెషన్ లోనే భూసంస్కరణలనుగురించి ఒక బిల్లును తేదలచినట్లు గవర్నరుగారి ప్రసంగములో ఉన్నది. ఎంతోకాలంనుంచి ప్రజానీకం యీ సంస్కరణలకు ఎదురుచూస్తున్నారు. కొలదిరోజులలో ఆబిల్లు చర్చకు రానున్నది కనుక దానిని గురించి నేనిపుడు విపులముగా చెప్పదలచుకోలేదు. భూసంస్కరణలకు సంబంధించినంతవరకు పేదప్రజానీకానికి బంజరుభూములను పంపకంచేయుడము నేడు ఒక ముఖ్యమైన సోపానము. మనరాష్ట్రములో 32 లక్షల ఎకరముల బంజరుభూమి ఉన్నదని ఇటీవలనే రెవిన్యూ మంత్రిగారు చెప్పారు. ఐతే బంజరుభూముల పంపకం విషయంలో యీనాడెన్నో అక్రమాలు జరుగుతున్నాయి. చాలచోట్ల ఆశ్రిత పక్షపాతం కనబడుతున్నది. ఈ అక్రమాలు జరుగకుండా ప్రభుత్వం కట్టుదిట్టాలు చేయవలసి ఉన్నది. జిల్లాస్థాయిలోను, తాలూకాస్థాయిలోను అనధికారులతో కూడిన సంఘములను ఏర్పాటుచేసి బంజరుభూముల పంపకంలో వారిసలహా సంప్రతింపులను పాటించడం ఎంతయినా అవసరమని నేను ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

పంచాయతీ సమితులను గురించి కూడా గవర్నరుగారి ప్రసంగంలో ఉన్నది

స్థానిక స్వపరిపాలనా రంగంలో పంచాయితీసమితులు చాలా ప్రధానపాత్ర వహించవలసిఉన్నది. జిల్లా, తాలూకా స్థాయిలలోకూడ అధికారాన్ని వికేంద్రీకరించి ప్రజలపరం చేస్తారని ఎంతోకాలంగా ఆశిస్తున్నాను. పంచాయతీ సమితులు బ్లాకు కౌన్సిల్సు బాగా పనిచేయాలంటే స్థానికంగా ఉండే ప్రజలకు వాటిల్లో స్థానముండాలి. అప్పుడే ప్రజాస్వామికమనేదానికి అర్థముంటుంది యీ సంస్థలు ప్రజాస్వామిక పద్ధతులలో రూపొందేటట్టు ప్రభుత్వం గట్టిఏర్పాటు తీసుకోవాలి. అప్పుడే యీసంస్థలను ఏర్పాటుచేసిన ఆశయం నెరవేరగలదని మనవిచేస్తున్నాను. జిల్లా స్థాయిలోకూడ అధికార వికేంద్రీకరణజరిగి అనధికారుల చేతులలో అధికారములు ఉంచినప్పుడే యీసంస్థలు ప్రజోపయోగకరంగా ఉంటాయి. ఈ సంస్థలలో అనధికారుల పలుకుబడి లేకపోయినట్లయితే అవి ప్రజాస్వామికసంస్థలుగా ఏర్పడవు. ఐతే ఇటీవల ప్లానింగ్ మంత్రిగారు జిల్లా కలెక్టర్లను డెవలప్ మెంట్ కమిషనరులుగా చెస్తామని చెసిన స్టేటుమెంటు కొంత ఆశాభంగంగా ఉన్నది. దానినిబట్టి చూచినట్లయితే జిల్లా స్థాయిలో అనధికారులకు ఎక్కువపలుకుబడి ఉండేటట్టు కనబడదు. ఇటువంటి అనుమానములకు తావులేకుండా జిల్లా స్థాయిలోకూడా అధికార వికేంద్రీకరణ జరిగేటట్టు చూడమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆహారోత్పత్తి అధికం చేయవలెననేది ప్రభుత్వంయొక్క ఆశయమైఉన్నది. అధిక ఆహారోత్పత్తి మనరాష్ట్రంలో సాధించగలిగామని గవర్నరుగారి ప్రసంగములో చెప్పబడిఉన్నది. ఐతే ఆహారోత్పత్తి అధికం చేయడంలో యీనాడు కొన్ని అవరోధాలు కలుగుతున్నాయి. అందులో ముఖ్యమైనది స్మాల్ సేవింగ్స్ కీ నేషనల్ సేవింగ్స్ కీ అనే దానిక్రింద రైతులకు ఇవ్వవలసిన వ్యవసాయపు ఋణములను బదిలీచేయడం జరుగుచున్నది. పొదుపు ఉద్యమానికిగానుడబ్బు సేకరించే బాధ్యతను బ్లాక్ అధికారులపైకూడా వేయడంవల్ల ఎన్నో ఇబ్బందులు కలుగుతున్నాయి. చాలాపొరపాట్లుకూడా జరుగుతున్నాయని మనవి చేస్తున్నాను.

అధిక ఆహారోత్పత్తికిగాను రైతులకిచ్చుటకు కేటాయించబడ్డ డబ్బును పొదుపు ఉద్యమాలకు డైవర్టుచేయడంవల్ల అధికాహారోత్పత్తి కుంటుపడుతుంది. పొదుపు ఉద్యమానికి ఇతర ఋణసేకరణలకు బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసర్లను వినియోగించటంవల్ల ఏదోవిధంగా వారు రైతులవద్దనుంచి డబ్బు వసూలుచేయవలసి వస్తున్నది. గత్యంతరంలేక అధికాహారోత్పత్తికి కేటాయించబడిన అప్పులను వారు ప్రభుత్వానికి అప్పుగా ఇవ్వవలసివస్తున్నది. ఈవిధంగా మా పశ్చిమ గోదావరి జిల్లాలో జరుగుతున్నవని నేను గట్టిగా చెప్పగలను. అందువల్ల బ్లాకు డెవలప్ మెంటు అధికారులకు ఋణసేకరణ విధులు అప్పగించకుండా అధిక ఆహారోత్పత్తికి కేటాయించిన మొత్తములు సక్రమంగా ఖర్చు అయ్యేటట్లు చూడవలసినదని కోరుతున్నాను. ఆవిధంగా చేసినట్లయితేనే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదం

శాల ఉపాధ్యాయులసమస్యలు పరిష్కారమవుతాయి. అందువల్ల రాష్ట్రంలోఉన్న aided పాఠశాలలనన్నింటిని స్వాధీనంచేసుకుంటే ప్రభుత్వవిధానానికి అనుగుణ్యంగా ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈస్కూల్సును బేసిక్ విద్యాస్కూల్సుగా మారుస్తున్నామని యీప్రసంగంలో ఉన్నది. కాని బేసిక్ విద్యావిధానంలో ఈప్రభుత్వం ఎక్కువశ్రద్ధ తీసుకోనుటలేదని చెబుతున్నాను. బేసిక్ విద్య accepted pattern of education. మన దేశంలోనే కాకుండా East-Europe, యింకా పాశ్చాత్యదేశాలుకూడ యీబేసిక్ విద్యయొక్క విశిష్టతను అంగీకరించి అమలుపరుస్తున్నాయి. కాని ఆవిద్యావిధానాన్ని అమలుపరుచుటలో తీసుకోనవలసినశ్రద్ధ మనప్రభుత్వము తీసుకోనుటలేదు. అది ఎక్కువఖర్చుతో కూడుకొని ఉన్నది. ఈ బేసిక్ విద్యావిధానము పటిష్ఠముగా పనిచేసేటట్లు చూడవలెనని కోరుతున్నాను.

ప్రొహిబిషన్ గురించి గవర్నరుగారిప్రసంగంలో, దీనిని కట్టుదిట్టముగా అమలుపరుచుటకు ప్రభుత్వం ఏవిధంగా యికముందు చర్య తీసుకుంటుందనే విషయం లేకపోవడం చాలావిచారకరం. దీనిని గట్టిగా అమలుపరుచుటకు Cabinet ఎప్పుడైనా ఆలోచిస్తుందా లేదా అనే అనుమానం ఉన్నది. ప్రొహిబిషన్ వల్ల ఎన్నో చిక్కులు ఏర్పడుతున్నాయి. లంచగొండితనం విపరీతంగా పెరిగిపోతున్నది. Law and order కు చాలానష్టంవస్తోంది. Police కు additional గా ఈబాధ్యతలు అప్పగించియుండకపోతే ఆ అధికారులు Law and order కు ఎక్కువ time వినియోగించడానికి వీలుండేది. Prohibition బాధ్యతలు వారిమీద పెట్టుటవలన డబ్బు సంబంధంలోని attractions కు లోబడి Law and Order విషయంలో వారు ఏవిధంగానూ శ్రద్ధతీసుకోనుటలేదు. Investigation కు cases report అయితే పోలీసుఅధికారులు జాగ్రత్తగా investigation చేయుట లేదు. న్యాయపరిపాలనకు చాలానష్టం వస్తోంది.

**శ్రీ పి. నరసింహారావు: (పాలకొండ):** వారు ప్రొహిబిషన్ను సపోర్టుచేస్తున్నారా? Criticise చేస్తున్నారా!

**శ్రీ ఎస్. కె వి. కృష్ణావతారం:** ప్రొహిబిషన్ను నేను బలపరుస్తున్నాను. కాని ప్రభుత్వం కట్టుదిట్టంగా అమలుపరిచేపరిస్థితిలో లేనప్పుడు దానినివదులుకోవాలి. లేదా, గట్టిగా అమలుపరచదలచుకుంటే strong measures తీసుకోవాలి. అవసరమయితే మద్రాసు ప్రభుత్వంవలె ప్రొహిబిషన్ ఆక్టును సవరించాలి. శిక్షాస్మృతులను మార్పుచేసి, చాలాకఠినంగా నేరస్థులను శిక్షించేఏర్పాట్లు చేయవలసిన అవసరం ఉన్నది. ఆవిధంగాచేసి ప్రొహిబిషన్ కట్టుదిట్టంగా, అమలు జరిగేట్లు చూడాలని మనవిచేస్తున్నాను.

Law and Orderను గురించికూడ ఉపన్యాసంగంలో ఉన్నది. రాష్ట్రంలో, అనుకున్నంత శాంతిభద్రతలు లేవని మనవిచేయవలసివచ్చినందుకు విచారిస్తున్నాను. నా 20 ఏండ్ల న్యాయవాదిగా ఉన్న అనుభవంలో ఈవిషయం చెబుతున్నాను. Law and Order విషయంలో ప్రభుత్వం యింకా ఎక్కువ శ్రద్ధతీసుకోవాలి. ఎక్కువఖూనీలు జరుగుతున్నాయి. దోపిడీలు జరుగుతున్నాయి. ఎక్కువ రైటింగ్స్ జరుగుతున్నాయి. అశాంతి ఎక్కువ ఉన్నది. ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధవహించి కట్టుదిట్టంగా చర్యలు తీసుకోనవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని మనవిచేస్తున్నాను.

ప్రభుత్వం Economy Committees ఏర్పరుస్తోంది. ఒకప్రక్క taxation-measures విషయంలో ఏమాత్రం చిన్నఆదాయంవచ్చే tax నయినా రైతుమీద వేయుటకు ప్రభుత్వం జెరచటంలేదు. కాని ఎన్ని Economy Committees ను వేస్తున్నా, ప్రభుత్వ ఖర్చులవిషయంలో దుబారా జరుగుతోంది. ఇది One-way traffic గా ఉన్నది. ఉదాహరణగా ఒకవిషయం మనవిచేస్తాను. Criminal Procedure Code—amend అయినది. దానిప్రకారం Sub-Divisional Magistratesకు గాక direct గా District Magistrate కు appeal కు provisions ఉన్నవి. మొదటలో డిస్ట్రిక్టు మేజిస్ట్రేట్సు అని కొత్తగా ఒక కాడర్ ఏర్పాటు చేశారు. కాని అది abolish చేసి Additional District Judges అని ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద 20 జిల్లాలలో అనగా 20 మందిని వేశారు. అందుకు రు 600/- రు 700/- లు Cadre లో ఉన్న అధికారిని ఒక్కసారి upgrade చేశారు. రు 300/— లు ఎక్కువజీతానికి ఆ స్కేలు పెరిగిపోయింది. ఈ Additional District and Sessions-Judges కు వేరే Special Public Prosecutors ను కూడా ఒక్కొక్కరికి రు 400/— పైచిలుకు retainer minimum యిస్తూ appoint చేసే ఉద్దేశములో ప్రభుత్వము ఉన్నది. వీరిని appoint చేశారో, లేక చేస్తే మానేస్తారో చేయబోతున్నారో తెలియదు. ఇంతమంది న్యాయవాదులు, అనుభవజ్ఞులు ఈ సభలో ఉన్నప్పుడు Special Cadre ను ప్రవేశపెట్టేటప్పుడు (obligation ఉన్నప్పటికీ లేకపోయినప్పటికీ) సంప్రదించియుంటే మేము సలహాయిచ్చే పరిస్థితిలో ఉండేవాళ్లము. కాని ఆవిధంగా సంప్రతించియుండలేదు. ప్రభుత్వం యిటువంటి అనేక వ్యయప్రయాసలకులోనైన మార్పులు తీసుకురావడంవల్ల అనవసర దూబారాఖర్చుకు కారణమవడం, complications రావడం జరుగుతోంది.

Corruption విషయం మితిమించిపోతోంది. రోజురోజుకూ దీనికి అంతుకనబడుటలేదు. ఆకాశానికి అంటుకుంటోంది. ఇందుకు ప్రభుత్వం సరైన

చర్యలు తీసుకుంటున్నట్లు కనబడుటలేదు. ప్రభుత్వం ఎన్ని శాసనాలు, ఎన్ని కార్యకలాపాలు చేసినా వాటి ప్రతిఫలం సామాన్య ప్రజానీకానికి లేకుండా పోతోంది. అక్రమవిధానంవల్ల, లంచగొండితనంవల్ల, అసలుఫలితం పొందవలసిన వారు పొందకుండా, ఇతరులు లాభం పొందుతున్నారు. ఈ విషయమై ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇర్రిగేషన్ విషయంలోగాని, electricity విషయంలోగాని, ఇతర రంగాలలోగాని ప్రభుత్వం కృషిచేస్తూనే ఉన్నది. ఇంకా అన్నిరంగాలలో మంచి అభివృద్ధి తీసుకువచ్చేందుకు మంత్రులు వారి వారి డిపార్టుమెంటులలో ప్రత్యేక శ్రద్ధతీసుకొని పనిచేయవలసి యున్నది. డెమాక్రటిక్ ప్రభుత్వాలలో ఉన్న మంత్రులు, యితర ప్రభుత్వాలలోని మంత్రులవలె కాకుండా, తమయొక్క ప్రభావాన్ని, బుద్ధిని, మేధస్సును డిపార్టుమెంట్సుయొక్క కార్యకలాపాలలో జొప్పించి శ్రద్ధగా పనిచేయగలిగినప్పుడే ప్రజాస్వామ్యము వర్ధిల్లుతుంది. కార్య కలాపాలు పూర్తిగా డిపార్టుమెంటులమీద వదలితే ప్రజాస్వామ్యం పటిష్ఠంగా పనిచేయదని చెబుతూ సెలవుతీసుకొంటున్నాను.

శ్రీ పి. వెంకటసుబ్బయ్య : అధ్యక్షా, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రతిపాదించిన అభినందన తీర్మానాన్ని బలపరుస్తు నా ఉపన్యాసం ప్రారంభిస్తు న్నాను. గవర్నరుగారి ఉపన్యాసం సాంగోపాంగంగా చూస్తే ప్రతి విషయంలోనూ శ్రేయోరాజ్యాన్ని స్థాపించుటకుగాను చేసిన ప్రయత్నమని చాల విదితంగా కనిపి స్తుంది. ముఖ్యంగా శ్రేయోరాజ్యస్థాపన అంటే అధికారం వికేంద్రీకరణచేసి వ్యక్తుల చేతుల్లోకి అప్పగించడం అన్నమాట. ఈ విషయంలో ప్రముఖపాత్ర మన ప్రభుత్వం వహించింది. ఈ పంచాయితీ సమితులు ప్రతి జిల్లాలో జిల్లాకు ఒక్కొక్క సమితి ఏర్పాటు చేయబడి ఆ పంచాయితీ ఏరియాలో ఉన్నటువంటి అధికారాలన్నీ పంచాయితీ సమితులకు అప్పచెప్పబడినవి. మొట్టమొదట రైతులకు రసాయన ఎరువులు, విత్తనాలు సప్లయి చేయడం, పైరులకు సంభవించే తెగు ళ్ళను పోగొట్టే మందులను సప్లయి చేయడం, ఆబోతు పోషణ, కోళ్ళపెంపకం కేం ద్రాలు, పశువుల ప్రథమచికిత్సా కేంద్రాలు, చిన్నరకం veterinary dispensaries, కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు ఏర్పాటు చేయడం, సాంఘిక సంక్షేమ పాఠశాలలు, వసతిగృహాలు, షెడ్యూల్డు కులాలవారికి బావులు త్రవ్వించడం, మాజీ నేరస్తులకు పాఠశాలలు, వారికి గృహవసతి పథకాలు మొదలయిన కార్య క్రమాలు ఈ బ్లాక్ సమితులకే అప్పచెప్పబడినవి. ప్రాథమికపాఠశాలలకు సంబం ధించిన వ్యవహారాలన్నీ ఈపంచాయితీసమితులే నడుపుతాయి. సెకండరీ పాఠశాల

లకు సంబంధించినంతవరకు Administrative Control కలిగ ఉంటాయి. ఈ విధంగా ఈ పంచాయితీలు అన్ని విధములయిన అధికారాలని హస్తగతం చేసుకుని పరిపాలనా వ్యవహారాన్ని సక్రమంగా జరుపుకోవలసిన అవసరం ఉన్నది. అందుకు తగిన తరిఫీదు పంచాయితీ సమితుల అధ్యక్షులకు ఇప్పుడు దానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. తరువాత ఈ పంచాయితీ సమితులకు వచ్చే రాబడి ఏమి అని మనం ఆలోచిస్తే వారికి ఎంత ఆదాయం, అధికారం సంక్రమించే ఏర్పాట్లు ప్రభుత్వం చేసిందో మనకు విదితం ఔతుంది.

ప్రభుత్వం, అఖిల భారత సంస్థలు, చేసే సహాయం ఈ సమితుల ద్వారా జరగాలి. ఆయా జిల్లా అధికారులు, జిల్లా బోర్డుల్లో మంజూరైన గ్రాంటు ఈ సమితులచే అమలుపరచబడిన ఆశాఖాపథకాల సొమ్మంతాకూడ వాటికి బదలీ చేయాలి. తరువాత వెనుకబడ్డ ప్రాంతాలకు అప్పుడప్పుడు ప్రభుత్వం ఇచ్చే గ్రాంట్లు ఈ సమితులకు ఇవ్వబడాలి. ఈ సమితి ప్రాంతాల్లోని భూమిశిస్తులు 6-1/4 శాతం సమితికి, అంతే మొత్తం గ్రామపంచాయితీలకు ఇవ్వబడాలి. ఇంకా జిల్లాబోర్డులకు ఇవ్వబడే బ్లాకు ప్రాంతంలోని భూమి శిస్తుపై సెస్సు, వృత్తులు మున్నగు వాటిపై విధించే పన్ను, బ్లాకు ప్రాంతాలనుంచి ఇప్పుడు జిల్లాబోర్డులకు వచ్చే రాబడులు ప్రజలు స్వచ్ఛందంగా ఇచ్చే విరాళాలు వాటికి రివెన్యూ క్రింద దాఖలు ఔతుంది. ఈ మొత్తాన్ని వినియోగించుకుని పరిపాలనా వ్యవహారాన్ని సక్రమంగా నిర్వహించడానికి ఈ పంచాయితీబోర్డు సమితులు పూనుకోవాలి. ఈ వికేంద్రీకరణ పద్ధతిలో అధికారాన్ని హస్తగతం చేసుకుని పరిపాలనా విధానాన్ని స్వయంగా ప్రజలే నడుపుకోడానికి ఏర్పాటు చేసినటువంటివి ఈ సమితులు. దాన్నిబట్టి చూస్తే ప్రభుత్వం అధికారాన్నంతా తనచేతుల్లో పెట్టుకుని తానే నిరంకుశాధికారం చలాయించాలనే భావంలేకుండా ఆ అధికారాన్నంతా ప్రజల స్వాధీనం చేసేటటువంటి మహా ఉత్తమమయిన ఒక విధానం ఇందులో గోచరిస్తున్నది. భారతదేశంలోకల్లా మన ఆంధ్రదేశమే ఈ విషయంలో ముందడుగు వేస్తున్నది అని చెప్పడానికి సందేహంలేదు.

ఈ మధ్య శ్రీ యస్. కె. డి. గారు ఉపన్యసిస్తూ మీరు ఈ విషయంలో చాలా ముందుకు పోయినారు, అధికారాలను అధికారుల చేతుల్లోకి అప్పచెప్పే బదులు ప్రజలచేతికి అప్పగించడం చాలా బాగుందని ఆయన ప్రసంగించారు. గవర్నరుగారి ఉపన్యాసంలో ఇంకొక ముఖ్యవిషయం సూచింపబడింది. అది భూసంస్కరణలు. భూసంస్కరణలు ఏవిధంగా ఉంటాయి, ఎంత (సీలింగు) పరిమితి పెట్టబడుతుంది, ఇది ప్రజలకు ఏ విధంగా లాభదాయకంగా ఉంటుంద మొదలయిన వివరాల్లోకి ఆయన వెళ్లకుండా ఇది అంతా కూడ మంత్రివర్గం చేతికే అప్పచెప్పారు. కనుక శాసనసభలో బిల్లు ప్రతిపాదించిన వెనుక సీలింగు విషయం వగైరాలు కొంచ

సభల్లో మనం చర్చించుకొన్న తరువాత Select Committee st geలో ఏఏ నిర్ణయాలకు వస్తామో తరువాత నిర్ణయమౌతుంది. అయితే గవర్నరుగారి ఉపన్యాసంలో సూచనప్రాయంగా ప్రముఖమయిన ఒకసూత్రాన్ని మనముందు పెట్టారు. కనుక వారు ఇందుకు అభినందనీయులు.

తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మనం **175. 74** కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలని అనుకొన్నాము. ఇప్పటికి **84** కోట్ల రూపాయలు ఈ సంవత్సరాంతంవరకు ఖర్చు ఔతుందని ఈ నివేదికలో చెప్పబడింది. మనం ఖర్చుకు ఏమాత్రం వెనుదీయుడంలేదు. మనకు ఉన్నటువంటి డబ్బును lapse కాకుండా శ్రద్ధగా ఖర్చుపెట్టుటకు ప్రయత్నం చేస్తున్నాము. తరువాత ఆహారోత్పత్తి విషయంలో మనం చాల ముందడుగువేశాము. మొదటి పంచవర్ష ప్రణాళిక అంతమయ్యే నాటికి **40 1** లక్షల నుండి **54 21** లక్షల టన్నుల వరకు ఆహారోత్పత్తి మనం పెంచుకున్నాము. తరువాత రెండవ పంచవర్ష ప్రణాళికాంతం నాటికి మనం **70. 64** టన్నులవరకు ఆహారోత్పత్తి పెంచాలని దానికి నిర్విరామమైనకృషి మనప్రభుత్వం చేస్తోందని అందులో సూచించినందుకు చాల సంతోషము వెలిబుచ్చవలసి ఉన్నది.

తరువాత కె. సి. కెనాలు క్రిందను, రాజోలిబండప్రాజెక్టు క్రిందను ఆయకట్టు పెంచడానికి గాను ఒక సూచన చేయుబడింది. ఇప్పుడు కె. సి. కెనాలు ప్రాంతంలో **75** మైళ్ళవరకు **3** కోట్ల రూపాయల ఖర్చుతో repair చేయుబడింది. **75** వ మైలు నుంచి T.il en! వరకు కె. సి. కెనాలును అభివృద్ధి చేస్తేనే గాని రాయలసీమ జిల్లాలకు ప్రయోజనం ఉండదనే విషయం ప్రభుత్వం గుర్తించి, దానికి గాను రెండు కోట్ల రూపాయలు ఎక్కువగా ఖర్చు చేయవలసి ఉంటుంది. ఆడబ్బును కేంద్రప్రభుత్వం కొంతవరకు సహాయం చేయాలని మన ప్రభుత్వం అడుగుతున్నారు. వారుకూడా ఇచ్చేదానికి సుముఖంగా ఉన్నట్లు తెలుస్తున్నది. ఈ ఏరియా ఆయకట్టను పెంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నందుకు మనం చాలా సంతోషించవలసి ఉన్నది.

తరువాత భారీ పరిశ్రమల విషయంలో మూడు ముఖ్యమయిన F.ctories' మన రాష్ట్రంలో పెట్టాలని, కేంద్ర ప్రభుత్వాన్ని ఈ ప్రభుత్వం వత్తిడి చేస్తూనే ఉన్నది. ముఖ్యంగా బొగ్గు గనుల సమీపంలో ఎరువుల **Factory** ఒకటి పెట్టాలని, – బోధన్‌లో Newsprint Factoryపెట్టాలని, విశాఖపట్టణంలో Minor Diesel Engine Factory ఒకటి స్థాపించాలని మన ప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని అర్థిస్తూనే ఉన్నది. అయితే సుముఖమయిన జవాబు ఇంకారాలేదు. భవిష్యత్తులో ఈ ఫ్యాక్టరీలు నెలకొల్పబడతాయని ఆశింపవచ్చును.

సింగరేణిబొగ్గుగనులలో అధికోత్పత్తి సాధనకై పెట్టుబడిరూపేణా, ఋణరూపేణా, సహాయం చేయుడానికి ఇటీవల భారతప్రభుత్వం సూత్రప్రాయంగా సమ్మతించడం

కాల సంతృప్తికరమయిన విషయం. ఇది త్వరలోనే వారు అమలుపరుస్తారని మనం ఆశించవచ్చును. ఈబొగ్గుగనులలో 1961-62 సంవత్సరం నాటికి మూడు మిలియన్లటన్నుల ఉత్పత్తిని సాధింపబడగలదని మనం నమ్మవచ్చును. తరువాత సేద్యపు నీటిపారుదల విషయంలో మనప్రభుత్వం ప్రబలమయిన ప్రయత్నం చేస్తూ అన్ని ప్రాజక్టులకంటే గొప్పదయిన నాగార్జున సాగర్ ప్రాజక్టును కట్టడానికి ప్రయత్నం చేస్తున్నది. ఈప్రాజక్టువల్ల 31. 83 లక్షల ఎకరాల భూమి సాగుఅవుతుంది. తుంగభద్ర ఎగువకాలవ విషయంలో కూడా ప్రబలమయిన ప్రయత్నం జరుగుతోంది. ఈప్రాజక్టు క్రింద 2. 77 లక్షల ఎకరాలు సాగుకావచ్చును. కదం అనే ప్రాజక్టు త్వరలోనే పూర్తికాబోతోంది. అక్కడ 67 వేల ఎకరాలు సాగుకు లాయుకీగా తయారవుతోంది.

ఈవిధంగా అన్నిప్రాజక్టులనిర్మాణానికి, ఆయకట్టుపెంపకానికి, ఆహారోత్పత్తి అధికం చేసుకోడానికి, ప్రభుత్వంవారు నిర్విరామకృషి చేస్తున్నందుకు వారిని మనం అభినందించవలసి ఉన్నది.

తరువాత వరదనివారణ కార్యక్రమములను గురించి చూస్తే, నిజానికి చాలా పెద్ద పెద్ద పథకములే ప్రభుత్వంయొక్క ప్రయత్నములో ఉన్నవి. బుడమేరు మరలింపు స్కీము, వైకుంఠపురం వరదకట్ట పథకం, బుడమేరు వరదకట్టల నిర్మాణం, ఉప్పుటేరు వెడల్పు పథకం, తూర్పు తుంగభద్ర మురుగు పథకం మొదలగునవి అమలులో పెట్టటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది.

విద్యుచ్ఛక్తిని గురించి చూస్తే, మనకు ఇప్పటికే అమలులో ఉన్న మాచ్‌ఖండ్ ప్రాజెక్టువల్ల first set of generators తో అంటే ఒక turbine తో అక్కడ పని జరుగుతున్నది. దానిద్వారా అక్కడి నుంచి రేణిగుంట వరకు మనకు విద్యుచ్ఛక్తిని తెచ్చుకో గలుగుతున్నాము. ఇంకను పనిచేయటానికి 3 sets of generators పెట్టినట్లయితే, రాష్ట్రములో చాలా భాగము విద్యుచ్ఛక్తిని విస్తరింపజేయటానికి అవకాశము ఏర్పడుతుంది. ఇదిగాక యింకను మనకు మిగులుతుంది. ఆ విధముగ మిగిలిన విద్యుచ్ఛక్తిని ఇతర రాష్ట్రములకు కూడ సప్లయిచేసే అవకాశము ఉంటుంది. ఇప్పుడు అమలులో పెట్టబోయే ఎగువ సీలేరు పథకం విషయములో కేంద్రప్రభుత్వంవారు దీనిని ప్రారంభించటానికి అనుమతి ఇచ్చారు. దీనికి కావలసినటువంటి డబ్బు కూడ పొదుపు ఉద్యమములో మిగిలిన డబ్బును దీనిక్రింద ఉపయోగపరచుకోటానికి గూడ అనుమతి ఇచ్చారు. దీనికి బహుశః ఆరుకోట్లదాకా పెట్టుబడి అవసరమవుతుంది. అది పూర్తిచేసుకుంటే 180 మిలియనువోల్టుల విద్యుచ్ఛక్తి మనకు లభ్యము అవుతుంది. ఈ విధముగ ప్రభుత్వము విద్యుచ్ఛక్తి విషయములో నిర్విరామకృషి జరుపుతున్నది.

తర్వాత షెడ్యూలు తరగతులు, మాజీనేరస్థులు, వెనుకబడిన తరగతులవారు, ఇలాంటివారందరికీ సౌకర్యాలు యథాప్రకారంగా కొనసాగుతునే ఉన్నవని గవర్నరుగారి ఉపన్యాసములో చెప్పబడియున్నది. అయితే ఈ సౌకర్యాలు ఏ విధముగ చేయబడుతున్నవో, వీరి కొరకు బడ్జెటులో కేటాయించబడిన సొమ్ము వీరి క్రిందనే సక్రమపద్ధతిలో ఖర్చుచేయబడుతున్నదా, అనేది అంతా పరిశీలించి చూస్తే, అంతకంటే మించిన కృషే జరుగుతున్నట్లుగా మనకు ఇచ్చిన లెక్కల ద్వారా తెలియుచున్నది. వీటి విషయములో కొన్ని వివరములు మనవి చేస్తాను. 28 2-58 వ తేదీ నాటికి Housing schemes వగైరాల క్రింద ఈ కింది వివరములు పరిశీలించండి.

| Particulars of Castes | Budget allotment Lakhs | | Amount spent Lakhs |
|---|---|---|---|
| (1) C. T. and Schedule Castes :— | | | |
| (1) Housing | 7. 04 | — | 7. 69 |
| (2) Education | 5. 66 | — | 3. 87 |
| (3) Medical and Health | 3. 05 | — | 2. 74 |
| (4) Sinking wells & repairs | 00. 21 | — | 00. 18 |
| (5) Other Schemes | 3. 39 | — | 2. 98 |

అంటే మొత్తముమీద 19.35 లక్షలు బడ్జటు ప్రొవిజనుఉంటే, అందులో నుంచి 17.46 లక్షలు ఖర్చు చేయబడింది కాబట్టి యీ విధముగ కృషి జరుగుచున్నది.

తరువాత Welfare of Schedule Tribes విషయమును గురించి ఆలోచిద్దాం. వీరివిషయములో గూడ సాధ్యమైనంతమటుకు నిర్విరామకృషియే జరుగుచున్నది. తరువాత

| | Budget allotment Lakhs | | Amount spent Lakhs |
|---|---|---|---|
| (1) Communications | 27—53 | — | 11. 7 |
| (2) Medical & Health | 1—38 | — | . 88 |
| (3) Agriculture and animal Husbandry | 2. 58 | — | 1. 38 |
| (4) Education | . 86 | — | . 60 |
| (5) Rural Water Supply | 1. 45 | — | 1. 64 |
| (6) ఇతర సౌకర్యములు | 2. 7 | — | 1. 93 |

ఈ విధముగా మొత్తముమీద 36.54 లక్షలవరకు బడ్జెటులో ప్రొవిజను ఉంటే, అందులోనుంచి 18.13 లక్షలదాకా ఖర్చుచేయబడింది. కాబట్టి దీనిని బట్టి ప్రభుత్వము ఏలాంటి తాత్సారము లేకుండా పనులు జరిపిస్తున్నదని చెప్పటకో వచ్చు. కాబట్టి ఈ జాతుల వారందరు, మాకేమి సౌకర్యాలు కల్పించడము లేదని చింతపడ నవసరము లేదు.

తరువాత సహకారోద్యమను విషయములో ప్రతిగ్రామములో కూడ ఒక co-operative soceiy ఉండాలని, ప్రతి పౌరుడు కూడ అందులో సభ్యుడుగా ఉండాలని అఖిల భారత గ్రామీణ పరపతి సౌకర్యాల సర్వేసంఘము వారు సిఫార్సు చేశారు. దీనికి గాను l.rge scale మీద Co-operative Societies ను మన దేశములో ఏర్పాటు చేసుకుంటున్నాము. రెండు Farmers Co-operative Societies ను ఆంధ్ర ప్రాంతములో సర్కారు జిల్లాలలో ముందుగా స్థాపించాలని ప్రభుత్వము నిర్ణయించినట్లు తెలుస్తున్నది. అవి వెంటనే ప్రారంభమవుతాయి. సహకారరంగములో ఇది చాలా ప్రధానమైన కృషియే నని చెబుతున్నాను. ఇంతేగాక ప్రజారోగ్యము విషయములోను, గృహనిర్మాణ సౌకర్యాల విషయములోను, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువగ కృషిచేయుటకు ప్రభుత్వం సంకల్పించి యున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద 90 లక్షలు దీనికొరకు కేటాయించబడింది. ఈసొమ్మంతయుకూడ తొమ్మిదిబ్లాకులలో 45 గ్రామాలలోఖర్చుచేయటానికి, వీటికి సంబంధించిన పథకములను ప్రభుత్వం అమలు పరుస్తున్నది. సంవత్సరము ఒకటింటికి 250 ఇళ్ళచొప్పున హరిజనులకు ఇళ్ళు కట్టిస్తున్నారు. ఇలాంటి కృషి ప్రతిజిల్లాలోనుకూడ జరుగుతునే యున్నది.

తరువాత low income group scheme క్రింద co-operative పద్ధతిలో 8 వేలకు మించకుండాను, అంతకులోబడి కొన్ని ఇళ్ళు కట్టించడానికి Building Colonization Societies ద్వారా కొన్ని సదుపాయములు ప్రభుత్వం కల్పించుచున్నది. ఈపథకము ద్వారా ఇళ్ళు లేనటువంటివారికి ఎనిమిది వేల వరకు అప్పులు ఇచ్చి, ఇళ్లుకట్టుకోటానికి సదుపాయములు ప్రభుత్వం కలుగ జేస్తున్నది. ఇది చాలా గొప్ప కృషి అని చెప్పవచ్చు. దీనిని గురించి గవర్నరు గారి ప్రసంగములో ఉదహరించినందుకు వారిని అభినందిస్తున్నాను.

తరువాతnon-gazetted ఉద్యోగస్థుల విషయము చూస్తే, వారికి ప్రభుత్వం ఎంతవరకు సహాయపడుతున్నదో మనకందరికీ తెలును. 1—4—1957 తేదీ నుంచి Adhoc allowance క్రింద ప్రభుత్వం ఆరు రూపాయలు, నూరు రూపాయలు వరకు జీతాలు తెచ్చుకొనేవారికి శాంక్షను చేసి యున్నది. 'తరువాత

..

రెండువందలవరకు జీతాలు తీసుకొనే వారికి కూడ ఆరు రూపాయలు allowance యిస్తున్నది. ఇదేమాదిరి Elementary School Teachers కు basic pay లోనే అయిదు రూపాయలు increase చేశారు. ఈ విధముగ ప్రభుత్వం వీలు అయినంతవరకు అన్ని రంగములలోను సహాయము చేస్తూనే ఉన్నది. ఈ విధముగా జీతాలు, allowances పెంచడము వల్ల ప్రభుత్వానికి సుమారు 2 నుంచి 2 1/2 కోట్లదాక అధికవ్యయము అవుతున్నది. ఈ ఖర్చు అంతా ప్రభుత్వము ఏవిధముగా భరించగలదనేది కూడ ప్రభుత్వోద్యోగస్థులు కొంతవరకు గమనించాలి. ఇంతవరకు పెంపుజేసినను, వారిలో సంతృప్తి అనేదే కన్పించడము లేదు. ఏ వ్యక్తికి అయినా ఆశకు మితము ఉండాలని అంటున్నాను. ఆశకు మితము లేక పోవడము, బహుశః మనకు స్వరాజ్యము వచ్చింది గనుక కాబోలు, స్వరాజ్యము వచ్చిన తరునాత మనవాళ్ళకు కోరికలు ఎక్కువగ కనబడుతున్నవి. కాని అవసరమైనంత ధనము ఉంటే, ఎన్ని కోరికలు అయినా తీర్చుకోవచ్చు. బిడ్డలు తమ కున్న కోరికలన్నీ తీర్చమని తండ్రినికోరడము సహజమే. అయితే తండ్రికి వచ్చే ఆదాయము ఎంత అనే విచారణ లేకుండా అవి తీర్చమని కోరడము విచారకరము. నేను ఈ మధ్య Indian Express యొక్క Sunday Standard Paper లో ఒక చిన్నకథ చదివాను. అందులో Council of Essex లో గుమస్తాపని చేస్తున్న వ్యక్తికి, ఆతని work ను బట్టి, అధికార్లు జీతముపెంచాలని ఉద్దేశపడినప్పుడు, ఆయన, "నాకు వచ్చే జీతము చాలును, వచ్చే జీతములో తృప్తికరముగనే ఉరుపుకుంటున్నాను, నాకు జీతము పెంచేబదులు, నాకంటే క్రింది స్థాయిలో ఉన్నవారి జీవితము వచ్చే తక్కువ జీతముతో గడుపుకొనలేకున్నారు, వారికి ముందు జీతము పెంచకోరుతున్నాను" అని తనకు జీతము పెంచనవసరములేదని అన్నాడట, కాబట్టి ఉద్యోగస్థులలో ప్రతి ఒక్కరికి కూడ అలాంటి మనస్తత్వము వస్తే, ముందుకు పోవటానికి వీలు అవుతుంది. కాబట్టి తృప్తి అనేది ఎక్కడో ఒక చోట ఉండాలి. తృప్తి అనేది లేకపోతే "ఆశాపాశము తాకడు; నిడుపున్ లేదింతంబు రాజేంద్రా!" అన్నట్లు ఏ వ్యక్తికైనా ఈ ఆశ ఎంత దూరమైనా పోతూనే ఉంటుంది. దానికి నీతి, నియమము అనేవి ఉండాలి. అది లేనటువంటి మానవుని జీవితము ఎప్పుడు కూడ అసంతృప్తితోనే ఉంటుంది. కాబట్టి "నాకు జీతము చాలు" అనే మనస్తత్వము అలవర్చుకోవలసి ఉంటుందని ప్రభుత్వోద్యోగస్థులను హెచ్చరిస్తున్నాను. ఈ విషయమును గవర్నరుగారి ప్రసంగములో ఉదహరించినందుకు నేను ఎంతో మెచ్చుకుంటున్నాను, కాని గవర్నరు గారి ప్రసంగములో మన ప్రభుత్వము భవిష్యత్తులో తలపెట్టిన కార్యక్రమములు ఏమిటో, మనకు గోచరము అవుతూనే ఉన్నవి. అవి కొన్ని ఇదివరకే చెప్పాను. Large scale మీద Fertilizer Plants near

Singareni Collieries ఒకటి, Diesel Engine Factory at Visakhapattanam, News Print Factory at Bodhan, ఇవి అన్నీ కూడ ఏర్పాటు కాబోతున్నవి. సింగరేణి బొగ్గుగని అభివృద్ధిపరచటానికి కేంద్ర ప్రభుత్వం అప్పు యివ్వటానికి ఒప్పుకున్నది గనుక అది ఇకమీదట అభివృద్ధి చెందుతుంది. తరువాత సహకార సిద్ధాంతము మీద అయిదు చక్కెర ఫ్యాక్టరీలు స్థాపించబడ బోతున్నవి. తరువాత వైద్యరంగములో Private Medical College ఒకదానిని కాకినాడలో యీ సంవత్సరము ప్రారంభించ బోతున్నారు. వచ్చే సంవత్సరములో మరొకటి వరంగల్లులో పెట్టబోతున్నారు. వైద్యరంగములో ప్రభుత్వము ఏలాంటి అశ్రద్ధ చేయుడము లేదు. ఇటీవలనే కర్నూలులో ప్రభుత్వము యాజమాన్యమున ఒక గవర్నమెంటు మెడికల్ కళాశాలను ఏర్పాటు చేశారు. అది కర్నూలులో స్థాపించడమువల్ల రాయలసీమ కంతటికినీ, ఎక్కువగ సౌకర్యము ఏర్పడినది. దీనికి ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. తరువాత Unani Ayurveda వైద్యాలకు సంబంధించి పరిశోధనా కేంద్రము నెలకొల్పబడుతుందని గవర్నరుగారి ఉపన్యాసములో సూచించబడినది.

ఇదిగాక వ్యవసాయరంగంలో కూడ 1957–58 లో 2 08 టన్నుల వరకు అధికముగ ఆహారధాన్యము ఉత్పత్తి ప్రభుత్వము సాధించింది. ఇక 1961-62 సంవత్సరము నాటికి 70 64 టన్నులు ఉత్పత్తి చేయగలుగుతుందని ఆశిస్తున్నాము.

కాబట్టి అన్ని రంగములలోను కూడ ప్రభుత్వము కృషి చేస్తూనే ఉన్నది.

తరువాత తెలంగాణా విషయములో ప్రభుత్వము ఏవిధముగాను తాచ్ఛారము చేయుడములేదు. ఈ విషయముకూడ గవర్నరుగారి ప్రసంగములో పేర్కొన బడినది. ఇప్పుడు కేటాయించినదిగాక, తెలంగాణాకు యింకా మూడు కోట్లవరకు ఎక్కువ ధనము కేటాయించడము జరిగింది. తెలంగాణాలో Electricity క్రింద ఒక కోటి రూపాయలు ఇటీవలనే ప్రభుత్వము శాంక్షను చేసింది. దానిద్వారా తెలంగాణాలో మూడు, నాలుగు వందలు గ్రామాలకు Electricity supply extend చేయటానికి అవకాశము ఏర్పడింది. కాబట్టి యీ రంగములో కూడ ప్రభుత్వము కృషి చేస్తూనేఉన్నది. ఈ విషయమును గురించి గవర్నరుగారు తమ ఉపన్యాసములో చెప్పినందుకు, వారు అభినందనీయులు. అన్నింటికంటె ముఖ్యముగను ధ్వనీభూతముగా ఉన్నది ఏమిటంటే, శ్రేయోరాజ్యస్థాపనము.

శ్రేయోరాజ్యస్థాపన
ధ్యేయముగానెంచి యాంధ్రదేశమునందున్
శ్రీయును సరస్వతియును, కృ
పాయుతులై యుండంగనిరి ఔ రామమంత్రుల్.

అందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తూ సెలవుతీసుకుంటున్నాను.

మిస్టర్ ఛైర్మన్:- గౌరవసభ్యులు గవర్నరుగారి ప్రసంగమును గురించి మాట్లాడేటప్పుడు ఎక్కువగ Lanl Reforms ను గురించి మాట్లాడుతున్నారు. దానికి seharate గా Bill వస్తుందిగనుక, ఈ విషయములన్నీ ఆ సమయములో మాట్లాడవచ్చును. కాబట్టి యిప్పుడు ఆవిషయములు మాట్లాడకుండా, వీలుఅయినంతవరకు avoid చేయడము మంచిదేమోననుకుంటున్నాను. అయినను గౌ॥ సభ్యులకు యిష్టములైతే మాట్లాడవచ్చును. అయినా avoid చేయడము మంచిదేమోనని నేను అభిప్రాయపడుతున్నాను.

శ్రీ బి. ఎల్లారెడ్డి (బుగ్గారం):- అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగం మీద కొంతమంది సభ్యులు మాట్లాడారు. గవర్నరుగారి ప్రసంగం అందరము కూడ చూశాము. చదివాను. అయితే అది చాలా ఆశాభంగాన్ని కలుగజేస్తున్నదని నేను మనవి చేయదలచుకున్నాను. దానిలో "ఈపనులు చేశారు, ఆపనులు చేశారు. ఈ అభివృద్ధిని సాధించారు. ఆ అభివృద్ధిని సాధించారు" అని ఎన్నో విషయాలు పేర్కొనడం జరిగింది. ఇంతఅభివృద్ధిని సాధించినప్పుడు దీనివల్ల ప్రజలకేమైన గొప్పమేలు జరిగిందా, వారిపరిస్థితి అభివృద్ధి అయినదని అనుకోడానికి ఆస్కారం ఉన్నదా అంటే అలాంటి ఆస్కారం ఏమిలేదని స్పష్టంగా ప్రజల యొక్క జీవితానుభవమే చెపుతుంది. ఇప్పుడు రోజారోజు జరుగుతున్నటువంటి సంఘటనలుకూడా దీనిని ఋజువుచేస్తున్నాయి. దీనిలో మొట్టమొదటిదిగా land reforms గురించి ప్రస్తావించారు. ఇప్పుడు మీరు సెలవిచ్చినట్లు వ్యవసాయసంస్కరణలగురించి మనం బిల్లును చర్చించబోతున్నాం. అప్పుడు దానిమీద వివరంగా మాట్లాడుకోవచ్చు, చర్చించుకోవచ్చు. అయితే ఒక్కమాటమటుకు నేను ఈ సందర్భంలో చెప్పదలచుకున్నాను. "Land Reforms వస్తాయి, వస్తాయి" అని చాలకాలంగా అందరుకూడా ఎదురుచూశారు. "చాల దీర్ఘంగా ఆలోచిస్తున్నాం, దీర్ఘంగా ఆలోచిస్తున్నాం" అని ప్రభుత్వంవారి తరఫునకూడా చెబుతూవచ్చారు. కొండను త్రవ్వి త్రవ్వి ఏమిపట్టుకొచ్చారయ్యా అంటే ఎలుకను పట్టుకొచ్చారు. ఆఖరికి ఆఎలుకకూడా తప్పించుకుపోయింది. అన్నట్లుగా దీనిలోనుంచి తీసిన భూమిని భూమిలేనివాళ్లకు పంచడానికి ఆస్కారం ఉన్నదా అని కాగడాపట్టుకొని వెతికినా ఎక్కడాలేదనే అనిపిస్తున్నది. గవర్నరుగారి ప్రసంగంలో ఆవిషయమై గొప్పగా ఏమిచెప్పుకోలేదు. భూమినితీసి పంచుతామనేమాటకూడా దానిలోచెప్పలేదు. అటువంటప్పుడు వీటికి భూసంస్కరణలని పేరుపెట్టినందువల్ల కేవలం ప్రజలను తప్పుదారి పట్టించడానికి ఇది ఉపయోగపడుతుంది తప్ప మరేమిలేదు. వీటిని భూసంస్కరణలు అనిచెప్పడానికికూడా అవ

కాశం లేదు. భూసంస్కరణలు అంటే—ఏదో కొంత పరిమితిని ఏర్పరచి, **surplus** గా ఉన్నటువంటి భూమిని భూమిలేనివాళ్ళకు పంచడానికి చేసేటువంటి పథకం. దానినే భూసంస్కరణలు అనిచెప్పడానికి అవకాశం ఉంటుంది. అట్లాకాకుండా అటువంటి ఆస్కారము లేనటువంటి దానికి భూసంస్కరణలు అని పేరు పెట్టడం హాస్యాస్పద మైనటువంటి విషయం. భూస్వామ్య విధానాన్ని రక్షించడానికి చేసినటువంటి చట్టం అని పేరుపెడితే చాల సమంజసంగా ఉంటుందేమోనని నేను మనవి చేయదలచుకున్నాను. అందుచేతనే భూసంస్కరణలు అనేటువంటివి కేవలం బూటకము, నాటకము అనికూడా నేను మనవి చేయదలచుకున్నాను. ఎంతో అభివృద్ధిని సాధించామన్నప్పుడు సాధించినది ఏమిటి? అనిఅంటే అది ఎక్కడా మనకు గోచరించడం లేదు. ఉద్యోగస్థులయొక్క వేతనాల విషయంలో ఏదో సాధించామని కూడా దానిలో చెప్పారు. ప్రభుత్వసంస్థలలో పనిచేస్తున్నటువంటి ఉద్యోగుల, కార్మికుల విషయంలోను, ప్రైవేటు సంస్థలలో పనిచేస్తున్నటువంటి ఉద్యోగుల, కార్మికుల విషయంలోను విచారించి నివేదిక సమర్పించడానికి హనుమంతరావు కమిటీని **1956**లో వేయడం జరిగింది. అయితే ఆకమిటీచేసిన సిఫార్సులను ప్రభుత్వంవారు ఎంతవరకు అంగీకరించారనేది దానిలో చెప్పలేదు. అంగీకరించాము, దానిమీద ఏదో చర్యలు తీసుకున్నాము అని చెప్పడమే జరిగింది కాని అసలు ఏమితీసుకున్నారు, ఏమితీసుకోలేదు, వేటిని నిరాకరించారు, ఎంతవరకు తీసుకున్నారు అనేది చెప్పలేదు. అది చాల ఆశ్చర్యకరమైనటువంటి విషయం. అది తప్పకుండా చెప్పవలసిఉండె. **60** రూపాయలు వారు కనీసవేతనంగా సిఫార్సు చేస్తే ప్రభుత్వంవారు అంగీకరించింది **55** రూపాయలే. అందులోకూడా కొన్ని **categories** ను మినహాయించడం జరిగింది. **5** సంవత్సరాలు, **10** సంవత్సరాలుగా పనిచేస్తున్నటువంటి ఉద్యోగులను, కార్మికులను **temporary** ఉద్యోగులు అనే పేరుతో వారికి దీనిని వర్తింపచేయకుండా మినహాయించడం జరిగింది. అందుచేత వందలు, వేలమంది ఉద్యోగులు దీనివల్ల లాభం పొందలేకుండా పోతున్నారు. అంతేకాదు. **Electricity department** కు సంబంధించిన ఉద్యోగులు, **P.W.D. workshop** కు సంబంధించినటువంటి ఉద్యోగులనుకూడా దీనిలో చేర్చకుండా మినహాయించడం జరిగింది. ఇతరులను గుర్తించినట్లుగానే వారినికూడా ప్రభుత్వోద్యోగులుగా గుర్తించి వారికికూడా ఈ సౌకర్యం కలుగజేయడమన్నది సమంజసము, న్యాయము అయినటువంటి విషయం. కాని అలాచేయకుండా ఆవిధంగాత్రోసివేయడం జరిగింది. ఎందుచేత? ఇది కేవలం ఏవిధంగానైనా ప్రభుత్వం యింతోఅంతో డబ్బును మిగుల్చుకోవాలనే ఉద్దేశ్యంతో చేయడంతప్ప, కార్మికులకు, ఉద్యోగులకు సౌకర్యం కలుగచేయాలనేటటువంటి ఉద్దేశ్యం ఏమాత్రంలేదని దానిలో స్పష్టంగా

కనపడుతున్నది. ఆదేవిధంగా N.G.O.s కోరికలు ఉన్నాయి. వాటినిగురించి ఏదో **Pay Committee** ని నియమించారు. ఆ కమిటీవారు ఏదో ఆలోచిస్తున్నారు అని చెప్పుతున్నారు. ఆలోచిస్తున్నారుకూడా. అయితే ఒక్కవిషయం మనం ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసి ఉన్నది. **Central Government** వారు ఒకవిషయం చెప్పారు. 12 రూపాయలవరకు వేతనాలు హెచ్చించినట్లయితే అందులో 2/3 వంతు అంటే 12 రూపాయిలలో 8 రూపాయలు తాముభరిస్తామనిచెప్పారు. మిగతా 1/3 వంతు రాష్ట్రప్రభుత్వం భరించాలనిచెప్పారు. కాని జరిగింది ఏమిటి ? ఎందుకొరకు దానిని ఉపయోగించడానికి ప్రభుత్వం నిరాకరిస్తూవచ్చింది. కేవలం డబ్బుఖర్చు అవుతుందనే ఉద్దేశ్యంతోనే అలాచేశారు. 4 రూపాయిలు భరించినాకూడా కొంత డబ్బు ఖర్చుఅవకతప్పదు. ఆవిధంగా డబ్బుమిగుల్చుకోవాలనే ఉద్దేశ్యంతప్ప మరేమికాదు. గతసంవత్సరంన్నరనుంచి దాదాపు 180 లక్షల రూపాయల నష్టం ఉద్యోగస్థులకు జరిగింది. అప్పుడు దానిని ఉపయోగించడానికి పూనుకొని ఉంటే 60 లక్షలో ఎంతోఅదనంగా ప్రభుత్వానికి ఖర్చుఅయినప్పటికి లక్షలాది కుటుంబాలకు ఎంతోమేలుజరిగేది. ఇప్పటికైనా సరైనటువంటిపద్ధతులు విచారించి డబ్బుఖర్చు అవుతుందే అని కాకుండా వారియొక్క న్యాయమైనటువంటి కోరికలనుతీర్చి, వారికి సౌకర్యాలను కలుగజేయాలని వారిని కొంతవరకైనా సంతృప్తిపరచాలనేటటువంటి సదుద్దేశ్యంతో పూనుకున్నట్లయితే బాగుంటుంది. కానీ అదిఎంతవరకు జరుగుతుందో అనుమానాస్పదంగానే ఉన్నది. ఇటు teachers విషయంలోను, అటు ప్రభుత్వోద్యోగుల విషయంలోను, ఎటుచూచినప్పటికీ ఏదో విధమైన అసంతృప్తి కనపడుతున్నది.

Teachers విషయం చాలసార్లు చెవుతూవచ్చాము. సంపూర్ణంగా వారి కోరికలను తీర్చలేదు. వారివేతనాల విషయంలో, యింకా యితరవిషయాలలో ఆందోళనచేస్తూనేఉన్నారు. ఆవిషయంలోకూడా సరైనటువంటి విధానాన్ని ప్రభుత్వం అవలంబించలేదు. అంతేకాదు Private Aided Schools అన్నింటినీ ప్రభుత్వంతీసుకోవాలి అని యిదివరకే చట్టం చేయడంజరిగింది. వాటిని తీసుకోవడానికి ప్రభుత్వం ఒప్పుకున్నది. కానీ జరుగుతున్నది ఏమిటి ? ఇందాకనే కృష్ణావతారంగారు చెప్పారు. తాబేలునడకన జరుగుతున్నదన్నమాట. గత సంవత్సరం నెల్లూరుజిల్లాలో తీసుకున్నారు. ఆ తీసుకోవడంకూడా అన్నీ కాకుండా కొన్నే తీసుకున్నారు. కొన్ని తీసుకోకుండా మిగిలిపోయినాయి. ఈ సంవత్సరం మరో రెండుజిల్లాలకు దానిని extend చేస్తామని అన్నారు. ఈవిధంగా చేసినట్లయితే ఎంతకాలం పడుతుంది ? అన్నిజిల్లాలలోను తీసుకొనడానికి ఏ 5, 6 సంవత్సరాలలో పడుతుందనీ మనం అనుకోవలసి వస్తున్నది. అయితే, మరి ఈ 5,6

సంవత్సరాలకాలంకూడా ఆ పాఠశాలలలో పనిచేసేటటువంటి ఉపాధ్యాయుల యొక్క పరిస్థితి యిదేవిధంగా అధ్వాన్నంగా ఉండవలసిందేనా? వారు అట్లాగే బాధపడాల్సిందేనా? వారు అట్లాగే అసంతృప్తిగానే ఉండాల్సిందేనా? అని అడుగుతున్నాను.

సాధ్యమైనంతత్వరలోనే ప్రభుత్వం వాటన్నిటినీ ఎందుకు స్వాధీనం చేసుకో కూడదు? కనీసం ఎందుకు ప్రయత్నించకూడదు? ఈ విషయంలోకూడా ప్రభుత్వం యొక్క మనస్తత్వం, దృక్పథం వ్యతిరేకంగానే కనబడుతున్నాయి. డబ్బు మిగల్చుకోవాలనే అభిప్రాయంతప్ప, ప్రజలందరికి సౌకర్యాలు కలుగ జేస్తాము, విద్యా విధానాన్ని బాగు పర్చుదాము, అభివృద్ధి చేద్దాము అనే దృక్పథం ఎక్కడా కనబడుట లేదు. సంతృప్తులైన ఉపాధ్యాయులు పాఠశాలలో ఉంటే చదువు బాగా చెప్పతారు, దాని ద్వారా విద్యా విధానం బాగుపడుతుంది, సరైన పద్ధతులలో విద్య నేర్పే విధానాన్ని అవలంబించాలి, లేకపోతే విద్యాభి వృద్ధికే నష్టం కలుగు తుందని మనమంతా గుర్తించాలి. ఇప్పుడు అనేక విషయాలు అసంతృప్తికరంగానే జరుగుతున్నాయి. నేనిప్పుడు ఆవిషయాలలోనికి పోవడం లేదు. కొద్దివిషయాల మీద మాత్రమే ప్రసంగించ దలచుకొన్నాను. విద్యా విధానాన్ని చక్కబెట్టక పోవడానికి కారణం ఏమిటి? ఎన్నో ఘనవిజయాలను సాధిం చామని చెబుతున్నారు. అవన్నీ ప్రజలకు కనిపించకపోవడానికి కారణం ఏమిటి? ప్రభుత్వ విధానాలు యీ మాదిరిగా ఉన్నాయి. సరైన విధానాలు కావు. వక్ర మార్గాల వలంబించడం వలన యీవిధంగా జరుగుతున్నది. పైగా, ప్రజల సహకా రాన్ని పొందడానికి ప్రభుత్వం నిరాకరిస్తూందనినేను గంటాపథంగా చెబుతున్నాను. అసలు ప్రజల సహకారం అంటే ఏమిటి? ఇప్పుడు **District Planning and Development Committees, Taluk Planning and Development Committees** ఏర్పరచినారు. సమితులను కూడా ఏర్పాటు చేశారు. ఇవన్నీ డిమోక్రటిక్ పద్ధతికి దారి తీస్తాయని ఇదాంక కొండా లక్ష్మణ్ గారు చెప్పారు. ఈవిధంగా పెద్దమార్పులను చేస్తే, ప్రజలలో ఉత్సాహాన్ని రేకెత్తించ గలుగుతామని శ్రీకొండా లక్ష్మణ్‌గారు చెప్పారు. ఇది ప్రజలసహకారాన్ని పొంద డానికి పునాది అన్నారు. అయితే, ఈకమిటీలు చేసినంతమాత్రాన ప్రజాసహకారం వస్తుందా? ప్రతిపక్షసభ్యుల సహకారాన్ని నిరాకరిస్తూ, ప్రజలసహకారాన్ని ఆహ్వానిస్తున్నాము అని చెప్పడం బూటకమే అనిపించుకుంటుంది. కాని సరైన విధానం అనుసరించుకోదు. ప్రజలసహకారాన్ని పొందడానికి ఉద్యుక్తులు అవు తున్నారని అనుకోడానికి ఆస్కారం లేదని నేను గంటాపథంగా చెబుతున్నాను. ప్రతిపక్షంవారి అభిప్రాయాలను నిరాకరించడమే కాదు, తమ పార్టీయొక్క, రూలింగ్ పార్టీ అయిన కాంగ్రెసు పక్షపాతం చూపిస్తు ప్రతిపక్షాలను అనేక సంద

ర్భాలలో నిర్లక్షంచేస్తూ, ప్రక్కకు నెట్టడం జరుగుతున్నది. ప్రభుత్వంయొక్క ఈ విధానంవల్ల ప్రజలసహకారం పొందలేక పోతున్నదని మనవి చేస్తున్నాను. జిల్లా డెవలప్‌మెంట్ కమిటీలు, తాలూకా డెవలప్‌మెంట్ కమిటీలను అన్ని జిల్లాలలోను ఏర్పరిచారు, సందేహం ఏమీ లేదు. అయితే, వాటి నిర్మాణం ఏవిధంగా ఉన్నది? వాటిలో అన్ని పార్టీలకూ అవకాశం ఇచ్చారా? ఇస్తే ఎంతవరకు ఇచ్చారు. వీటిలో ప్రతిపక్షాల వారిని పూర్తిగా నిర్లక్ష్యం చేయడం జరుగుతోంది. అక్కడక్కడ, నామకః ఒకరిద్దరు ప్రతిపక్షం వారిని వేసినంత మాత్రాన ప్రజాసహకారాన్ని పొందుతున్నామనుకోడానికి వీలులేదు. అనేకచోట్ల, తమ పార్టీవారినే యీ కమిటీలలో నింపుకొంటున్నారు.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు: **On a point of Order, Sir.** ప్రతిపక్షంవారిని ప్రభుత్వ పక్షంలోని వారికంటె ఎక్కువ మందని తీసుకోవాలని వారి అభిప్రాయం?

శ్రీ బి. ఎల్లారెడ్డి: ఇందులో **Point** లేదు, **Order** కూడా లేదు. ఆ కమిటీలలో ఒకరిని ఒకచోట, మరొక్కరిని ఇంకొకచోట తీసుకున్నంత మాత్రాన చాలదు. చాలాచోట్ల ప్రతిపక్షాలవారిని అసలు తీసుకోననేలేదు. కాంగ్రెసు వారిని మాత్రమే నింపుకొన్నారు.

నల్లగొండ జిల్లాలోని **Planning Committee** లో ఎవరెవరిని నియమించారో, వారి వారి పేరులు, హోదాలు ఏమిటో చెప్పారు ప్రణాళికాశాఖ మంత్రిగారు యింతాక ఒక ప్రశ్నకు సమాధానంగా. అందులో **Co-operative movement** తరఫున ఒకరు ఇంకొక సంస్థతరఫున మరొకరుఅని ఈ విధంగా పేర్కొన్నారు. అయితే, అందులో, కాంగ్రెసు పార్టీ వారినే ఎందుకు తీసుకున్నారు? ఇంకొక పార్టీవారు అక్కడ ఎవ్వరూ లేకపోయారా? ప్రతిపక్షానికి చెందినవారు లేరా? ఉంటే ఎందుకు తీసుకోలేదు? గినినిబట్టి ప్రభుత్వంయొక్క దృక్పథం ఏమిటి? నామకః ఒకరిద్దరిని తీసుకుంటే అసలు తీసుకోనట్లుగానే ఉంటుంది. ఈ విధంగా చేస్తూఉంటే ప్రజల సహకారం ఎట్లా వస్తుంది? ఒక **glaring example** చెబుతాను. భువనగిరి బ్లాకు కమిటీని ఏర్పాటు చేసినప్పుడు ఇద్దరు కమ్యూనిస్టులను అందులో సభ్యులుగా వేశారు. అందులో శ్రీమతి కమలాదేవి, ఎం.ఎల్. ఏ. గారు కూడా ఉన్నారు. "కమిటీలో సభ్యులుగా నియమించాము, ఫలానా తేదీన సమావేశానికి రావలసింది" అని ఆహ్వానాలు పంపినారు. తీరా ఈ సభ్యులు వెళ్ళేసరికి, మేము పొరపాటున పంపించాము, మీరు సభ్యులు కారు" అని చెప్పారు. దీనికి కారణం ఏమిటి? ముందుగా వారిని తీసుకోవడం జరిగింది. సమావేశానికిరమ్మని ఆహ్వానాలు పంపించడం జరిగింది. కాని ఈమధ్యలో ఏదో నాటకం, గూడుపురాణి జరిగిందన్న మాట. పైనుంచి మంత్రివర్యుల జోక్యం వల్లనో, కాంగ్రెసు వారి ఒత్తిడివల్లనో వారిని తీసేయడం జరిగింది. దీని అంతరార్థం ఏమిటి?

ఈ మధ్య పంచాయితీ సమితులను ఏర్పాటుచేశారు జిల్లాకు ఒక పంచాయతీ సమితి ఏర్పాటుచేశారు. ఇందులో అవలంబించిన పద్ధతి ఏమిటి? కొన్ని గ్రామాలలో పంచాయతీ బోర్డు లున్నాయి. ఈ సమితులలోకి ఆ పంచాయతీ బోర్డుల అధ్యక్షులను తీసుకొంటున్నారు. పంచాయతీ బోర్డులు లేని గ్రామాల నుంచి కలక్టరుగారు ఎవరినైనా నియమిస్తారు. గ్రామానికి ఒకరు చొప్పున వారిలో నియమింపబడాలని పెట్టినారు. అయితే, దీనికి Basis ఉన్నదా? నాకు ఏమీ అర్థం కావడం లేదు. అట్లా నియమింపబడ్డ వారందరూ కాంగ్రెసువారే. ఉదాహరణకు భువనగిరి పంచాయితీ సమితిలో కమ్యూనిస్టుల నెవ్వరినీ తీసుకోలేదు. భువనగిరి సమితి ఏరియాలో మొత్తం ఎన్ని గ్రామాలలో పంచాయితీ బోర్డులున్నాయి? మొత్తం 50 గ్రామాలుంటే 10 గ్రామాలకుమాత్రమే పంచాయతీ బోర్డులున్నాయి. మిగిలిన 40 గ్రామాలనుంచీ సభ్యులను తీసుకున్నారు అందరినీ కాంగ్రెసు వారినే తీసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ వారి నెవ్వరినీ తీసుకొనలేదు. అక్కడి రెండు సీట్లనుండీ కూడా అసెంబ్లీకి కమ్యూనిస్టులే ఎన్నుకోబడినారు కాని ఆ సమితిలో ఎవ్వరినీ వేయలేదు. ఎందుకు వేయలేదు? ఇది ఏ దృక్పథాన్ని తెలుపుతుంది. కరీంనగర్ జిల్లాలో గంగాధరలో ఒక సమితిని ఏర్పాటుచేశారు అక్కడ పంచాయతీ బోర్డు లున్న గ్రామాలు 15 ఉన్నాయి. మిగతా 30 గ్రామాలలో పంచాయతీ బోర్డులు లేవు. అక్కడకూడా కమ్యూనిస్టుల నెవ్వరినీ తీసుకోలేదు. అక్కడనుంచి కూడా అసెంబ్లీకి కమ్యూనిస్టు సభ్యుడే ఎన్నుకోబడివచ్చారు. వేరే నియోజకవర్గం లోనివి అక్కడ 10, 15 గ్రామాలున్నాయి. అక్కడనుంచి శ్రీ [illegible] రాజేశ్వరరావుగారే ఎన్నుకోబడినారు. కాని సమితిలో కమ్యూనిస్టులను ఎవ్వరినీ వేయలేదు.

ఇదేవిధంగా యీ విషయానికి సంబంధించినవి ఎన్నయినా ఉదాహరణాలు చెప్పవచ్చు. ఎక్కడెక్కడయితే యీ విధంగా సభ్యుల నియామకం జరుగవలసి వస్తుందో అక్కడ ఏదో ఒక నెపంతో కాంగ్రెసు వారినే తీసుకోవడం జరుగుచున్నది. కమ్యూనిస్టులను ఎవరినీ అసలు ఎక్కడా నియమించడమే జరగడం లేదు. ఎక్కడో ఎప్పుడో ఒకరినో, యిద్దరినో తీసుకున్నారేమో తెలియదుగాని, సర్వసాధారణంగా కాంగ్రెసు వారినుండే నియమించడం జరుగుచున్నది. నల్లగొండ జిల్లాలో యిటువంటి పంచాయత్ సమితులను ఏర్పరచాలని నిర్ణయించారు. ఏ బేసిస్‌పైన దీనిని తీర్మానించారు? ఎక్కడయితే పంచాయతీ బోర్డులు ఎక్కువగా ఉన్నవో ఆ ప్రాంతాలలో వీటిని ఏర్పాటు చేయవలయునని ఉద్దేశించారా? వాస్తవంగా జరుగుతున్నదేమంటే నకిరెకల్లు బ్లాకు ఏరియా ఉంది. అక్కడ దాదాపు 25 గ్రామాలలో పంచాయితీ బోర్డు లున్నవి. అదేవిధంగా భువనగిరి బ్లాకు ఏరియాలో 10 గ్రామాలలో పంచాయతీ బోర్డులు ఉన్నాయి. ఈ విధంగా ఎక్కువ పంచాయతీ బోర్డులున్న ప్రాంతా

లలో ఈ సమితులను ఏర్పాటు చేయవలెనా? అంతకంటే తక్కువ పంచాయతీ బోర్డులుగల ప్రాంతాలను తీసుకున్నారు. ఇందుకు కారణం ఏమిటి? దీనికి ఒకటే ముఖ్య కారణం కనబడుతోంది. ఆ ప్రాంతాలలో కమ్యూనిస్టులు ఎక్కువగా ఉన్నారు గనుక అక్కడ వీటిని ఏర్పరుచ వలయునని నిర్ణయించితే సభ్యులుగా కమ్యూనిస్టువారే ఎక్కువగా వచ్చే ప్రమాదం వుందని భావించి తక్కువ పంచాయితీ బోర్డులున్న ప్రాంతాలనే select చేయడం జరిగింది. దేవస్థానం కమిటీల నియామకం విషయంలో కూడా యిదే పద్ధతి అవలంబించబడుతున్నది. తెలంగాణా ప్రాంతంలో నున్న వేములవాడ దేవస్థానం చాలా గొప్పది. ఆ దేవస్థానమునకు యీమధ్య ఒక కమిటీని ఏర్పాటుచేశారు. అందులో సభ్యులుగా ఎవరిని తీసుకున్నారు? ఆ జిల్లా బోర్డులో కాంగ్రెసు కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలవారు **5: 7: 2** నిష్పత్తిలో ఎంతమంది M L.A.s వున్నప్పటికి కాంగ్రెసు పార్టీకి సంబంధించిన అయిదుగురు M.L.A.లలోను నలుగురిని మాత్రం ఆ కమిటీలో నియమించడం జరిగింది. ఇతర పార్టీలవారిని ఎవ్వరిని తీసుకోలేదు. అయిదుగురు కాంగ్రెసు M. L. A లలోనుండి నలుగురిని మాత్రమే ఎందుకు తీసుకోవలసి వచ్చింది. అయిదవ M. L. A. ను ఎందువల్ల నియమించలేదు? కాంగ్రెసు పార్టీలో కూడా విభిన్నాభిప్రాయములుగల గ్రూపులు ఉండడం వలన ఈ విధంగా జరిగింది. మరొక విచారించవలసిన విషయమేమంటే—ఆ నియమించబడని M. L. A. గారు వేములవాడకు అతి సమీపములో ఉన్నారు. నియమించ బడిన వారు మాత్రం చాలా దూరప్రాంతంవారు. ఇది ఎందువల్ల జరిగింది? దగ్గర ప్రాంతాల వారిని వదిలేసి దూరప్రాంతాల వారిని ఎందువల్ల నియమించవలసి వచ్చింది? ఈ విధంగా చూసినప్పుడు యిందులో పక్షపాత వైఖరి అవలంబించబడుతున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. తమ పార్టీని అధికంగా బలపరచుకోవలయుననే దృక్పథం యిందులో గోచరిస్తున్నది.

అదే విధంగా కో-ఆపరేటివ్ సొసైటీస్ విషయంలో కూడా యిదే పద్ధతి అవలంబించ బడుతున్నట్లు మనకు తెలుస్తున్నది. కల్లుగీత పనివారు ఎక్కడైతే ఎక్కువమంది ఉంటారో ఆయా ప్రాంతాలలో కో-ఆపరేటివ్ సొసైటీలు ఏర్పాటు చేయవలయునని ఒక నిర్ణయం తీసుకున్నారు. గత సంవత్సరం **7** చోట్ల కో-ఆపరేటివ్ సొసైటీలు ఏర్పాటు చేయవలెనని, యీ సంవత్సరం అదనంగా **9** సొసైటీలు ఏర్పాటు చేయవలయునని నిర్ణయించారు. కాని యీ సొసైటీల ఏర్పాటు విషయంలో ఎక్కడయితే ప్రతిపక్షంవారు యిలాంటి సొసైటీలు స్థాపించారో అక్కడ మాత్రం యివ్వలేదు. కాంగ్రెసు పార్టీవారు అడిగినచోట్ల మాత్రం యిచ్చారు. ఇది కూడా ఒక ఉదాహరణ. మరో ముఖ్య విషయమేమంటే—ఎక్కడయితే గీతపనివారు (గౌండ్లు మొదలైనవారు) ఎక్కువగా ఉన్నారో

అక్కడ కాకుండా—గీతంగివారి సంఖ్య ఎక్కువగా వున్న ప్రాంతాలలో ఈ సొసైటీలు ఏర్పాటు చేయడానికి నిర్ణయించారు. దీనికి ఉదాహరణగా ఒక విషయం చెప్పదలచాను. నల్లగొండ జిల్లాలో దేవరకొండ ఒక పెద్ద టౌను. అక్కడ గీతంనివారి సంఖ్య అతి స్వల్పంగా వుంది. అటువంటిచోట కో-ఆపరేటివ్ సొసైటీ ఇచ్చారు. దీని అర్థం ఏమిటి? అదేవిధంగా సూర్యాపేటలో చాలా గణనీయమైన సంఖ్యలో గీతంనివారు ఉన్నారు. అక్కడ సొసైటీని ఏర్పాటు చేయవలసిందిగా ఎంత కోరినప్పటికి అక్కడ కమ్యూనిస్టు పార్టీవారు ఎక్కువగా ఉన్నారనే వుద్దేశంతో నిరాకరించడం జరిగింది. ముందు ఇస్తామని చెప్పి ఆఖరు నిముషంలో మాత్రం యీ రకమైన మార్పు జరిగింది. ఈ సంవత్సరం కూడా అక్కడ ఇదే విధంగా జరిగింది. ఈ సంవత్సరం సూర్యాపేటలో సొసైటీని ఏర్పాటు చేస్తామని ముందు చెప్పి, తరువాత దీనిని నల్లగొండకు ఇవ్వడం జరిగింది. ఇది ఎందువల్ల జరిగిందని? దీనిలో కూడా ఏదో గూడు పుఠాణీ వుంది. పరిశీలించి చూస్తే కాంగ్రెసు పార్టీవారిని బలపరచవలయుననే వుద్దేశం ఇందులో కనబడుతుంది. అంతేకాదు ఈ విషయమై రెవిన్యూ మంత్రిగారితో మాట్లాడడానికి వెళ్ళిన వారితో మంత్రిగారు ఏ జిల్లాలో అయితే ఎక్కువమంది M.L.A.s సంతకాలు చేసి సొసైటీలు కావాలని కోరతారో అక్కడ మాత్రమే అవి ఏర్పాటు చేయబడుతాయని" అన్నారు. దాని ప్రకారమే నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో అందరి M. L. A.s నుండి సంతకాలు తీసుకొని వెళ్లడం జరిగింది. దానిని చూచిన తర్వాత మంత్రిగారు—అందులో ఎక్కువగా కమ్యూనిస్టు పార్టీవారు, యితర పార్టీల వారు వుండడంవలన మరల దానికి అభ్యంతరం తెలుపుతూ—"కాంగ్రెసు పార్టీకి సంబంధించిన M.L.As యొక్క మెజారిటీ ఎక్కువగా వుండవలయును గాని యితర పార్టీలవారి మెజారిటీ వుండరాదు" అని చెప్పారు. దీనికి కారణమేమిటి? ఇదే విధంగా ఉద్యోగాల నియామకం విషయంలో కూడా యిటువంటి ధోరణి అవలంబించ బడుతున్నది. ప్రతి పక్షంతో సంబంధంగల అభ్యర్థులను ఉద్యోగాలలోకి తీసుకోనకుండా నిరాకరించడం జరుగుతున్నది. ఈ సందర్భంలో ముఖ్య మంత్రిగారి నియోజక వర్గంలో జరిగిన సంఘటనను నేను ఉదహరించదలచుకున్నాను. శ్రీ నాగిరెడ్డి గారు కమ్యూనిస్టు పార్టీ తరఫున ఎన్నికలలో నిలబడిన సమయంలో వారికి తోడ్పడ్డారనే నెపంతో కొంతమందికి ఉద్యోగాలు యివ్వడానికి నిరాకరించడం జరిగింది. అదే విధంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఒక సంవత్సరంనుండి పనిచేస్తున్న వారిని కమ్యూనిస్టు పార్టీతో ఎప్పుడో సంబంధం కలిగి వున్నారనే నెపంతో-వారిని "Your services aic not required" అని ఉద్యోగంనుండి తీసివేయడం జరిగింది. కాబట్టి కాంగ్రెసు ప్రభుత్వం—తమ పార్టీని బలపరచుకోవలయుననే ఉద్దేశంతో—యితరపార్టీలను దెబ్బకొట్టాలనే దురుద్దేశంతో కేవలం పక్షపాత

వైఖరినే అవలంబిస్తున్నారని చెప్పక తప్పదు. ఎంత కాలంవరకు యీ ప్రభుత్వం తమ పక్షపాతంతో కూడిన దృక్పదాన్ని మార్చుకోనదో అంతవరకూ ఊరికే "మాకు ప్రజల సహకారం కావాలి" అన్నందువల్ల వచ్చేలాభమేమీ ఉండబోదు ఎప్పుడైతే అన్ని పార్టీల వారు కలిసి కృషిచేస్తారో ఆనాడే మనం మన ఆర్థికాభివృద్ధిని పెంపొందించుకోనడానికి అవకాశం కలుగుతుంది. ఆనాడే ఆర్థికాభివృద్ధికి సంబంధించిన పథకాలు విజయవంతమవుతాయి, అన్ని పార్టీల వారు సహకరించినప్పుడే మన ఆశయాలన్నీ నెరవేరడానికి అవకాశం కలుగుతుంది. కాని ప్రస్తుత ప్రభుత్వ విధానం మాత్రం ఆ విధంగా కనబడడంలేదు. అదే విధంగా day- to- day adminisiration లో చాలా జోక్యం చేసుకోవడం జరుగుచున్నది. ఏ జిల్లాకు ఆ జిల్లా కాంగ్రెసు పార్టీ అధ్యక్షుడు ఆ జిల్లా admi- nistratrator గా వ్యవహరిస్తున్నారు. ఉద్యోగస్తుల transfers విషయం వరకు వారు జోక్యం చేసుకుంటున్నారు. అందువల్ల అధికారులు గందరగోళ పరిస్థితిలో ఉన్నారు. వారు చట్టబద్ధంగా చేయ సంకల్పించిన ప్రతిపనిలోను వీరు జోక్యం చేసుకొని అడ్డంకాలు కల్పించడం పరిపాటు అయినది. అధికారులతో "మీరు ఫలానా పనిని ఫలాన విధంగా చేయనిచో పైనఉన్న కాంగ్రెసు మంత్రిలతో చెప్పి, వారి పలుకుబడితో దానిని మార్పు చేయిస్తా"మని చెప్పుతారు. ఈ విధంగా పరిపాలనా వ్యవస్థనే పాడుచేస్తున్నారు. ఇందువల్లనే అనేక పనులు సక్రమంగా జరుగక పోవడం, విఫలము కూడ కావడం జరుగుచున్నది. ఇప్పటికైనా ఈ పక్షపాత బుద్ధిని, ఈ interfeiance ను దిద్దుకోవాలని, అలా చేసిననే గాని మనం ముందుకు పోలేమని హెచ్చరిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ. పి. నర్సింగరావు (హుజూరాబాదు జనరలు):- అధ్యక్షా! గవర్నరుగారి ప్రసంగంలో ప్రభుత్వ విధానం గురించి లేక దాని ఆశయాలను గురించిగాని, భవిష్యత్తులో దాని ధ్యేయమైన Socialistic pattern of society నిర్మాణం కొరకు కొన్ని నిర్దుష్టమైన సూచనలు చేస్తారనీ ఎంతో ఆశించాను. కాని అది మంత్రులు, కాంగ్రెసుపార్టీ అధినేతలు చెప్పుచున్న విషయాలయొక్క review మాదిరిగా కనబడినది. గవర్నర్‌గారు భూసంస్కరణలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. 1947 నుండి కాంగ్రెసు మంత్రులు, అధినేతలు భూసంస్కరణలు తీసుకవస్తామని చెప్పుతూనేవస్తున్నారు. అంతా విని విని విసుగెత్తి చివరకు ఎవ్వరూ దానిని seriousగా తీసికోనుటలేదు. ఐనా ఈ మధ్యన అసెంబ్లీలో ఇదిగో భూసంస్కరణలు తెస్తున్నామని పదేపదే ప్రకటనలు చేయు వల్ల, వాటిని ప్లానింగ్ కమిషన్, కేంద్రప్రభుత్వ ఆమోదానికి పంపిస్తున్నామని చెప్పుచుండుటవల్ల ఏవో కొన్ని radical changes జరుగబోతాయనే

ఆశలు రేకెత్తినవి. కాని బిల్లును తీరా చూస్తే అది Progressive అని అనిపించుకోదు. కాని regressive అని అనవలసి వస్తున్నది. ఈ బిల్లు ద్వారా ప్రభుత్వం యొక్క నిజ స్వరూపం బయటపడింది. తెలంగాణా ప్రాంతంలో Hyderabad Agriculture and Tenancy Act అమలులో ఉన్నది. అది చాలా నిర్దుష్టంగా ఉన్నది. దానిని అమలు జరుపుటలో ఎన్ని లోపాలు ఉన్నప్పటికీ, దానిలోని Provisions మాత్రం అన్ని రాష్ట్రాలలో కంటే చాలా progressiveగా ఉన్నాయని చాలా మంది అభిప్రాయపడడం జరిగింది. ఆ act లో ఉన్న 36 వందల పరిమితిని ఇప్పుడు 54 వందలకు పెంచడము జరిగింది. ఆంధ్రలోని ప్రతి బిల్లును తెలంగాణాకు extend చేయడం జరుగుతున్నదేగాని అక్కడ నిర్దుష్టంగా ఉన్న ఇలాంటి బిల్లునైనా ఆంధ్రప్రాంతానికి అనుగుణంగా అవసరమైతే కొన్ని సవరణలు చేసి అమలు చేసుకుండా కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు: ఎలుకగూడ ఇందులో లేదు. కాని ఇంకొక కొండను తెచ్చిపెట్టినట్లు ఈ బిల్లును తెస్తున్నారు. ఈ సంస్కరణ యొక్క ఉద్దేశమేమిటో గవర్నరుగారి ప్రసంగంలోనే తెలుపలేదు. ఇప్పుడు ప్రవేశపెట్టబోతున్న బిల్లు వల్ల land hungerness ను తీర్చడం సాధ్యంకాదు. ఈ చట్టంవల్ల తెలంగాణలో భూస్వాములు తమ భూములు అమ్ముకొనగా వీలులేక మిగిలిపోయినదానిని గూడ ఇప్పుడు అమ్ముకొనుటకు అవకాశమేర్పడుచున్నది. 1955 land holding census ప్రకారం వంద ఎకరముల కంటె ఎక్కువ భూమిగల వారు 1482 మంది మాత్రమే ఆంధ్ర ప్రాంతంలో ఉన్నారు. వారి దగ్గర ఉన్న మొత్తం భూమి 251710 ఎకరములు. కాని ఈ మధ్య ordinance వచ్చిన తరువాత divisions partitions కావడం జరిగింది. ఒకసారి రివెన్యూ మంత్రిగారు Press Conference లో మాట్లాడుతూ రెండు లక్షల ఎకరముల భూమి గూడ లభ్యం గాకపోవచ్చునని చెప్పినట్లు నాకు జ్ఞాపకమున్నది. పేదలకు భూములు పంచాలనే ఉద్దేశం ప్రభుత్వానికి ఉన్నచో ఇలాంటి బిల్లుగాని ఇంత జాగుకాని చేసిఉండేదికాదు. ఈజిప్టులో revolution వచ్చిన వెంటనే ఇన్ని ఎకరముల కంటె ఎక్కువ ఉండుటకు వీలు లేదని ఒక ordinance జారీ చేశారు. ఆదాయ ప్రసక్తి లేకుండా మొద్దుగా భూమి మీద cealing నిర్ణయించారు. ఆ విధంగా అమలు జరుగుచున్నది. ఏ సంస్కరణ ఐనా అది drastic గా లేనిచో ఫలితం కనపడదు. తెలంగాణ భూసంస్కరణల చట్టంలోని provisions ఎంత మంచివి ఐనా వాటిని drastic గా అమలు చేయనందున ఫలితమును ఎవరూ feel చేయలేదు. ఎన్నో సంవత్సరాల నుండి భూసంస్కరణలు తెస్తాము అని అంటూ ఈనాడు ఈ బిల్లును చూచిన తరువాత ప్రభుత్వం యొక్క చిత్తశుద్ధిని శంకించ వలసి వస్తున్నది.

గవర్నరుగారి ప్రసంగంలో ప్రభుత్వానికి సంబంధించిన అన్ని శాఖలను గురించి reference ఉంది. వాటిలోపల నేను ముఖ్యంగా విద్యావిషయాన్ని గురించి చెప్పదలచాను. మనప్రభుత్వ విద్యావిధానం చాలా విచిత్రంగా ఉంది. ఏరాష్ట్రంలోనూ ఇంత inefficient గా మంత్రిగారూ పనిచేస్తున్నట్లు నాకు తోచడంలేదు. గత సంవత్సరం Schools తెరచిన 2–3 నెలలవరకు students కు text books supply కాలేదు. దీనివిషయమై పెద్ద గందరగోళం జరిగింది. ఇదే శాసనసభా వేదికనుంచి ఎందరో గౌరవసభ్యులు Adjournment Motions ద్వారాను లేక ఇతర సందర్భాలలోను ఈ విషయాన్ని తెచ్చినపుడు, blue రావడంచేత text books supply చేయుడంలో ఆలస్యంజరిగిందని, వచ్చేసంవత్సరం ఈవిధంగా జరుగకుండా Text-Books Selection Committee ని ముందుగానేపిలిచి schools తెరవక ముందే పుస్తకాలను ready గా ఉంచేందుకు ఏర్పాట్లుచేస్తామని చెప్పారు. కాని ఈసంవత్సరంకూడా schools తెరచి 2–3 నెలలైనా కొన్ని schools లో students కు text books లేక బాధపడుతున్నారు. Books supply కాలేదుకాబట్టి కోర్సు కొంతతగ్గిస్తామని ముఖ్యమంత్రిగారో లేక విద్యాశాఖమంత్రిగారో చెబుతున్నారు. ఒకప్రక్క మనం standard పడిపోతోందని చింతిస్తుంటే, మరోవైపున books supply కాలేదు కాబట్టి లక్షలకొద్ది students suffer అవుతారు. కనుక కోర్సు తగ్గిస్తామని, short course పెడతామని చెప్పడం ఏమాత్రం సరైన విషయంకాదు. ఏదో ఒక సంవత్సరం పొరపాటు జరిగిందంటే అర్థం చేసికోవచ్చు. కాని ప్రతి సంవత్సరం అదే పరిపాటి అయిపోతోంది. ఏ democratic country లో నైనా కూడా యింత inefficient government కాని మంత్రికాని యింతకాలం అధికారంలో ఉండడాన్ని ప్రజలు సహించరు. అందుచేత విద్యాశాఖా మంత్రిగారు, Cabinet లో member అయివుండి, Education Department కు తాను head అయిఉండి కూడా దానిని సక్రమంగా నిర్వహించడంలేదు కనుక, వెంటనే ఆపదవికి రాజీనామా నిచ్చి ప్రజాస్వామ్యంలో ఒక సత్సాంప్రదాయాన్ని నెలకొల్పడం సమంజసమైన విషయమని నేను చెబుతున్నాను. మొత్తం Cabinet నే resign చేయమని కోరవలసిందే కాని నేను ఆవిధంగా కోరడంలేదు.

తెలంగాణాలో 1956–57, 57–58 సంవత్సరాలలో విద్యాశాఖకు కేటాయించినసొమ్ములో చాలామొత్తాలు ఖర్చుపెట్టబడలేదు. దీనివల్ల కలిగిన ఫలితమేమంటే పాఠశాలలుండి పిల్లలులేకపోవడం Basic Schools గాను, Multipurpose Schools గాను మార్చినచోట్ల Trained Teachers లేకపోవడం; ఈవిధంగా 1956–57 లో తెలంగాణా ప్రాంతంలో provision

ఉండికూడా దాదాపు 70 లక్షల రూపాయలు ఖర్చు పెట్టబడలేదు. State Integration వల్ల ఖర్చుపెట్టలేకపోయామని సాకు చెబుతున్నారు. కాని 1957-58 లో కూడా అదేవిధంగా కొన్ని లక్షలు మిగిలిపోయాయి. Provision ఉండికూడా ఖర్చుపెట్టక Trained Teachers లేరని చెబుతుంటే ఏమని అర్థం చేసుకోవాలో తెలియడంలేదు. ఈ విధంగా విద్యాశాఖలోను యితర శాఖల్లోను కూడా అసమర్థత కనిపిస్తోంది.

రెండవ పంచవర్ష ప్రణాళికను గురించి గవర్నర్‌గారు చెబుతూ, ఆంధ్ర ప్రదేశ్‌లో ఇందుకుగాను 175.74 కోట్ల రూపాయలకు స్కీముల ఉన్నాయనియు, 1958–59 చివర వరకు రు. 84 కోట్లు ఖర్చు కావచ్చునన్నారు. అంటే ఇంకా 84 కోట్ల రూపాయిలు ఖర్చుకాలేదన్నమాట. ఈ 3 వ సంవత్సరంలో 30 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టినచో మొత్తం 3 సంవత్సరాల్లోను 48% ఖర్చు పెట్టినట్లవుతుంది. మొదటి సంవత్సరం preparations, etc కు పోయినా 2,3 సంవత్సరాలలో ఎక్కువ సొమ్ము ఖర్చు కావాలి. కానీ యింత వరకు 40% కంటె యెక్కువ ఖర్చు కాలేదు. ఈ ప్రణాళికలో Major Irrigation విషయంలో progress బాగానే ఉన్నదని ఒప్పుకోకతప్పదు. కానీ Minor and Medium Irrigations విషయంలో ఈ progress చాలా చెడ్డగాఉంది. Plan target ను సాధించడానికి మనం 3 వ సంవత్సరంలో రు. 45 కోట్లు సమకూర్చుకోవలసిఉంది. ఈ డబ్బు యెక్కడనుంచి వస్తుంది? దీనిని సమకూర్చుకొనే శక్తి మన ప్రభుత్వానికిఉందా? స్కీములకోసం allot చేసిన సొమ్ము lapse అయిపోతుంటే, అసలు ప్రణాళికా లక్ష్యానికే విరుద్ధంగా జరుగుతోందని చెప్పక తప్పదు.

గవర్నరుగారు పంచాయితీ సమితులను గురించి కూడ చెప్పారు. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో జిల్లాకొక సమితిని ఏర్పాటుచేసి శ్రీ మెహతా కమిటీ report ను ఆచరణలో ప్రప్రథమంగా మన రాష్ట్రంలో పెట్టినందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసి యున్నది. కానీ ఆచరణలోకి వచ్చేసరికి Blocks selection విషయంలోను, వాటి కమిటీలను నామినేటు చేయడంలోను పక్షపాత దృష్టి వచ్చి పడుతోంది. కనీసం పక్షపాత దృష్టి, పాలసీ మరియు ప్రోగ్రాము లోపల, వారికి అధికారం ఉంది కాబట్టి, పెట్టుకొనవచ్చుననుకోండి. కానీ సామాన్య విషయాలలో కూడా, సమితి devolopment activitiesలో ప్రతిపక్ష సభ్యులు ఈ విషయంలో సహకరిస్తామని చెబుతున్నవారికి సరైన ప్రాతినిధ్యాన్ని ఇవ్వక కేవలం పక్షపాత దృష్టితోనే తమ పార్టీకి, మరొకు చెందిన వారినే ఆ కమిటీలలో నింపుకోవడంవల్ల అసలు ఆశయం ఎన్నటికీ కూడా నెరవేరదు. శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటీ రికమండేషన్సు రాగానే ఒక నిర్దిష్టమయిన బిల్లును ప్రవేశపెడ

తామని చెప్పి ఒక సంవత్సరం కావచ్చింది. దానిని ఎప్పుడు ప్రవేశపెడతారో తెలియడంలేదు. తెలంగాణాకు సంబంధించినంతవరకు ప్రతి Block లోను, ప్రతి తాలూకా లోను 10-15-20-30 పంచాయితీకమిటీల కంటే ఎక్కువ లేవు. ఇందువల్ల మెహతా కమిటీ ఉద్దేశ్యం ఏదైతే ఉందో అది నెరవేరడంలేదు. మళ్ళీ nomination అంటే గ్రామ పెత్తందార్లే వస్తారు. అందువల్ల ఆ Billను తొందరగా తీసుకురావలసిన అవసరం ఎంతైనాఉంది. తెలంగాణాలో 3 సంవత్సరాలకొకసారి పంచాయితీకమిటీలకు ఎన్నికలు జరిగి అవి అధికారంలో ఉంటాయి. ఈ గడువు తీరిపోయి ఒక సంవత్సరం కావస్తోంది. కాని ఆ periodను ప్రభుత్వం extend చేసిందో లేక ఆ కమిటీలే continue అవుతున్నాయో తెలియదు. ఇప్పటికి అ పాత కమిటీలే continue అవుతున్నాయి.

కనుక ఏఏ బ్లాకులలో పంచాయితీ సమితులను ఏర్పాటు చేయబోతున్నారో ఆ బ్లాకులలో ఎన్నికలను జరిపించవలసిందిగా నేను ప్రభుత్వమునకు మనవి చేస్తున్నాను. ఎన్నికలలో అధికార పార్టీకి చెందినవారు సభ్యులుగా ఎన్నికైనప్పటికీ ఏవిధమైన ఆక్షేపణకు అవకాశముండదు. కనుక ప్రభుత్వాను ఆ బ్లాకులలో ఎన్నికలను జరిపించటానికి ఆ బిల్లును తక్షణమే ప్రవేశపెట్టాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

శ్రీ పి. నరసింహ అప్పారావు (పాలకొండ):- అధ్యక్షా ! నేను ఈ రోజు గవర్నరుగారి ప్రసంగనుపై మాట్లాడదలచుకొన్నాను. భూసంస్కరణల గురించి ఆబిల్లువచ్చినప్పుడు వివరంగా మాట్లాడగలను. ఈరోజుమిగిలే విషయాలపై మాట్లాడదలచాను.

ముందు పంచాయితీలగురించి, జిల్లాపరిషత్తులగురించి కొద్దిగా మాట్లాడదలచుకొన్నాను. పంచాయితీ సమితులను, జిల్లాపరిషత్తులను ఏర్పాటుచేయాలనే ఉద్దేశ్యము మంచిదే. కాని అవి ఏవిధంగా పనిచేస్తున్నాయో, వున్నడబ్బు ఏవిధముగా ఖర్చుపెట్టబడుతున్నదో శ్రద్ధగా పరిశీలించాలని నేను ముఖ్యమంత్రిగారికి మనవి చేస్తున్నాను. నేనీనాడు వాటిలో జరుగుతున్న దుబారా ఖర్చులనే ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకురాదలిచాను. ఈ పంచాయితీ సమితులకు డిప్యూటీ పంచాయితీ Offecers కొత్తగా 80 మందిని appoint చేస్తున్నారు. వీరినేగాక Extention Officers ను, Co-operative Inspectors ను, Educational Officer ను కూడా పంచాయితీ సమితులలో నియమిస్తున్నారు. వీరికివీటిలో చేయవలసిన పని ఏమీ వుండదు. ఒక తాలూకాలో ఏగ్రామంలో ఎంత మొత్తం వస్తున్నదో, ఎంత పనిజరుగుతున్నదో, ఏగ్రామానికి ఎంతసొమ్ము యివ్వబడుతున్నదో తెల్సుకోటానికి ఒక Inspector, ఒక Sub-Registrar, చాలును. అనవసరంగా, దుబారాగా ఈనాడు staff ను పెంచటం జరుగుతోందని నేను మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను.

ప్రజాసహకారములో ఒకస్కూలును కట్టుతున్నామని తెల్పుతారు. కాని వున్న estimation ఒకటైతే వారు మరియొక estimation ప్రకారం పనిచేస్తున్నారు. ఒక సంవత్సరం ముగిసేలోపునే ఆ స్కూలు ఎందుకు పనికిరాని స్థితిలో వుంటున్నది. అటువంటి పాఠశాలలు మాజిల్లాలో అనేకము వున్నవి.

ఇప్పుడు Social Education Organiser ను వేస్తున్నారు. వారు B. D. O లు కలసి జీపులలో తిరగడంతప్ప మరోపని చేయరు. ఇటువంటి ఖర్చులను తగ్గించటానికి ముఖ్యమంత్రిగారు ప్రయత్నించాలని వారిని మీద్వారా కోరుతున్నాను. ఇటువంటి అనవసరపు ఖర్చులనుతగ్గించి గ్రామాలలో రోడ్లను నిర్మించటానికి ఆసుపత్రులను స్థాపించటానికి ఆడబ్బును వినియోగించవలసిందగా వారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

ఆహారోత్పత్తిని అధికముచేయటానికి మనప్రభుత్వము, భారత ప్రభుత్వము కృషిచేస్తున్నవి. కాని ఆహారోత్పత్తిని అధికముచేయటానికి అవసరమైన ఎరువులు ఈనాడు, స్వల్పధరలకు లభించటంలేదు. అమ్మోనియం సల్ఫేటు ఈనాడు అధిక ధరలలో లభిస్తుంది. ఈభారమంతా రైతులే భరించవలసివస్తున్నది. ప్రభుత్వము నకు ఈనాడు లభించిన 5 కోట్ల అప్పు రైతులనుండే లభించిందని నేను ప్రభుత్వ మునకు మనవిచేస్తున్నాను. ఈనాడు ప్రతిభారమును రైతులే భరించవలసవస్తున్నది. రెండుసంవత్సరాలక్రితం రు 59-0-0 కడుతున్నపట్టాకు నేడు 120-0-0 శిస్తుకట్టవలసివస్తున్నది. కాని దానికి ఏవిధమైన సబ్సిడి వారికి లభించటంలేదు. కనీసము రైతులకు అవసరమైన పనిముట్లధరలను, ఎరువులధరలను తగ్గించి, వారు సంతోషముగా పనిచేయుటకు ఉత్సాహాన్ని కల్గించవలసినదిగా మంత్రిగారికి మీ ద్వారా మనవిచేస్తున్నాను.

మనరాష్ట్రములో పంచదారఫ్యాక్టరీలను స్థాపించాలనేఉద్దేశ్యముతో ముఖ్య మంత్రిగారు చాలాకష్టపడి 5 ఫ్యాక్టరీలకు లైసెన్సులను సంపాదించారు. డబ్బు వసూలుచేయటంకూడా పూర్తి అయింది. అయినా ఇంతవరకు ఎక్కడా పని ప్రారం భింపబడలేదు. మా శ్రీకాకుళం జిల్లాలో 10 లక్షల రూపాయిలను వసూలు చేశాము. అయినా అక్కడ ఫ్యాక్టరీ పని యింకా ప్రారంభించబడలేదు. అచ్చటి ప్రజలంతా ఈఆలస్యానికి తమ ఆందోళనను ప్రకటిస్తున్నారు. దానిని గురించి త్వరలోనే చర్యలుతీసుకోవలసిందిగా ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను.

నీటిపారుదల విషయములో మా జిల్లా వెనుకబడివున్నది. దూరమనే అభి ప్రాయముతో, గవర్నరుగారుకూడ మాప్రాంతములో పర్యటించరు. కాని ఆజిల్లా పరిస్థితి ముఖ్యమంత్రిగారికి తెలుసునుస్తు నాగార్జునసాగర్ కట్టినందువల్ల మాప్రాంత మునకేమీ లాభించదు. మా జిల్లాలో, చేయవలసిన ముఖ్యమైన పనులు అనేకము వున్నవి. వరదనివారణ పథకాలువున్నవి. 1947 లో నాగావళికి వరదవచ్చి, అనేక

గ్రామాలు నష్టబడి ఇప్పటికకూడా అనేకం డబ్బు వేస్తున్నవి. రు|| 40 లక్షలు ఖర్చు ఎక్కువగా భావించరాదు. ఇంకా ఎక్కువ మొత్తము ఖర్చుచేయవలసిన అవసరంవున్నది. మిగతావాటిని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనైనా ప్రారంభించాలని ముఖ్యమంత్రిగారికి మనవిచేస్తున్నాను. వంశధార ప్రాజెక్టుకూడ ప్రారంభిస్తారని ఆశిస్తున్నాను.

ఇక ఒక్క విషయం ఉన్నది. N. G. O. లకు ఈమధ్యన ఇచ్చిన సౌకర్యాల వల్ల రెండు కోట్లు చిల్లర అవుతున్నదని గవర్నరుగారు తమ ఉపన్యాసములో చెప్పారు. పక్క రాష్ట్రం లో 12 రూపాయల వరకు ఇచ్చారు. ఈ విషయంలో శాసన సభ్యులందరు సహకరిస్తాము. ఇందు నిమిత్తమై ఏమైనా పన్నులే వేస్తే అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాము. ఇంతకే ఆరు రూపాయలు ఇచ్చి ఉన్నారు. మిగతా ఆరు రూపాయలు వారికి పెంచవలసిందని కోరుతున్నాను. లేనిచో మరింతగా లంచగొండితనం వృద్ధి చెందగలదని అనిపిస్తున్నది. కడుపు నిండా భోజనం లేకపోతే గుమాస్తా లగాయతు బంట్రోతు వరకు లంచం పుచ్చుకుంటారు. వారికి కడుపు నిండా భోజనం పెట్టి తప్పు చేస్తే శిక్షించినట్లయితే కొంతవరకు భయం ఉంటుంది. అందువలన ఆరు రూపాయల వరకైనా వీరి జీతం హెచ్చించాలని కోరుచున్నాను.

శ్రీ ఏన్. సి. శేషాద్రి (రాయదుర్గం) : అధ్యక్షా, గవర్నరుగారి భాషణపైన తీసుకొని రాబడిన ఈ అభినందన తీర్మానాన్ని బలపరుస్తూ కొన్ని విషయాలు మాత్రం ప్రభుత్వం దృష్టికి తీసుకురాదలచినాను. మామూలుగా గవర్నరుగారు భాషణ చేసినప్పుడు రాష్ట్రంలో ఉండే seasonal conditions గురించి కొంత చర్చ జరగడం పరిపాటిగా ఉండేది. ఇదివరకు గవర్నరుగారు ఉపన్యాసము చేసినప్పుడల్లా ఈ విషయము గురించి చెబుతూ ఉండేవారు. ఈతూరి గవర్నరుగారి ప్రసంగంలో ఆ విషయమై ఏమీ ప్రస్తావన లేదు. దీనివల్ల ఈ రోజున రాష్ట్రంలోని ప్రజానీకానికి కొన్ని ప్రాంతాలలో క్షామపరిస్థితులు ఉన్నాయా, లేదా అనే అనుమానానికి దారితీయ గలదని నేను భావిస్తున్నాను. ఈ ఉపన్యాసములో ఏ ప్రస్తావన లేని కారణంచేత, అనంతపురం, చిత్తూరు జిల్లాలలో ఈ కరువు పరిస్థితులు ఏర్పడిన విషయం ప్రభుత్వం cognizance లోనికి తీసుకున్నదా లేదా అనే అనుమానం నాకు కలుగుతున్నది. చిత్తూరు, అనంతపురం జిల్లాలలో ముఖ్యంగా ఎర్రనేలలో కేవలం ముంగారి పంటలపై ఆధారపడే రైతులు వర్షాలు లేక విత్తనాలుకూడా వేయలేదు. పశువులకు గడ్డిదొరకడం చాలా కష్టంగా ఉన్నది. పశుసంపద క్షీణించిపోతున్నది. ఇంత జరుగుతున్నా, ఎప్పుడో వర్షం వస్తుంది, పచ్చగడ్డి వస్తుంది అని ఉద్యోగస్థులు, మంత్రివర్గం అనుకుంటూ ఉండడం

చూస్తే చాలా చింతించవలసివున్నది. ఇప్పుడు వర్షమువచ్చినప్పటికినీ పచ్చిగడ్డి పెరగడానికి ఏమాత్రం అవకాశంలేదు. 6 మొదలు 9 అంగుళాలు ఎత్తుగా గడ్డి పెరగదు. ప్రభుత్వంవారు ఈవిషయం గమనించి చిత్తూరు, అనంతపురం జిల్లాలలో గడ్డికై బాధపడేచోట ప్రభుత్వ అడవులలోనుంచి గడ్డి సరఫరాచేస్తేనే కాని నానాటికి క్షీణించిపోయే పశుసంపద ఎక్కువకాలం నిలువడానికి వీలులేని పరిస్థితులు ఏర్పడినాయని నేను భావిస్తున్నాను పోయిన సంవత్సరం కూడా క్షామం వచ్చింది. అనంతపురంజిల్లాలో. పోయిన సంవత్సరానికి శిస్తురెమిషన్ ఇవ్వాలని ప్రభుత్వానికి నివేదికలు పెట్టుకున్నా ఈ సంవత్సరం శిస్తు వసూలు కాలమైనప్పటికినీ ఇంతవరకు ఉత్తరువులు రాలేదు. కొన్నిచోట్ల మామూలుగానే శిస్తు వసూలు చేస్తున్నారు. ఈవిషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చారు. ఇటువంటి crisis precipitate చేయకుండా కరువుప్రాంతాలలో తగిన చర్యలు తీసుకోవలసింది గా అక్కడ ఉద్యోగస్థులకు సరియైన ఉత్తర్వులు తక్షణమే జారీచేయడం ప్రభుత్వకర్తవ్యమని తమద్వారా మనవిచేస్తున్నాను. గవర్నరుగారి ఉపన్యాసములో అనంతరామన్‌గారి అధ్వర్యాన భూమిశిస్తు విచారణసంఘం వేసిన విషయం ప్రస్తావించినారు. భూమిశిస్తువిధానాన్ని సంస్కరణ చేస్తున్నామని వారుచెప్పడం జరిగింది. ఈసంస్కరణ ఎంతత్వరలో అమలులోనికి తెస్తే రైతులకు అంత మరుసగా ఉంటుందని అభిప్రాయపడుతున్నాను. ఒకసంవత్సరం లోపలనే రైతులపై అనేకరకాలైన పన్నులను విధించారు. సర్‌ఛార్జి వాణిజ్యపంటలపై పన్ను, నీటితీరువ పెంపకం ఇటువంటివి అనేకం జరిగాయి. ఒక్కొక్కదఫా వీటి అన్నింటికి లెక్కలు తయారు చేయడం రైతులకు గ్రామోద్యోగులకు కష్టంగా ఉన్నది. ఈపన్నుల విధానాన్ని నిర్వహించడంలో గ్రామోద్యోగులు ప్రభుత్వోద్యోగులు ఉత్తరువులను సరిగా అర్థం చేసుకోకుండా వారి ఇష్టంవచ్చినట్లు అమలుచేస్తున్నారు. ఉదాహరణగా పోయిన సంవత్సరం మనం వాణిజ్య పంటలపై విధించిన పన్ను అమలుజరపడాన్నే తీసుకోవచ్చును. పోయిన సంవత్సరం వేరుశెనగ పంట బొత్తిగా దెబ్బతినడంవల్ల పన్ను మాఫీ చేశారు. Special assessment ఒక రూపాయి మాఫీ చేశారు. Special assessment 1—0—0 మాఫీచేసినా, సెస్సు 5 అణాలు మాత్రం ఖచ్చితంగా ఇవ్వాలని ఈరోజున జిల్లా అధికారులు సెస్సు వసూలుచేస్తున్నారంటే ప్రభుత్వోద్యోగులు ఏవిధానాన్ని అవలంబిస్తున్నారో, మనం చేసేచట్టాలను ఎంతవరకు అర్థం చేసుకుంటున్నారో అనుమానాస్పదంగా వున్నది. ఒక రూపాయి special assessment మాఫీ చేసినా 5 అణాలు ఇవ్వాలనే పిడివాదం చూస్తే మనం చేసే legislation ను సరిగ్గా అర్థం చేసుకుంటున్నారా అనిపిస్తుంది. అసలు మాఫీచేసినా వడ్డీమాత్రం ఖచ్చితంగా ఇవ్వాలనే ధోరణి వీరిలో కనిపిస్తున్నది. అదే ప్రకారంగా పోయిన సంవత్సరం ప్రత్తిపంటకు కేంద్రమైన అనంతపురం జిల్లాలో ప్రత్తిపంట దెబ్బతిన్నది. ఈ విషయమై కొంత ఆలస్యంగా కలెక్టరు రిపోర్టులు పంపారు. ఈ రోజువరకు ఆ రిపోర్టులేమైనాయో తెలియదు. ఆ రిపోర్టులపై ప్రభుత్వం

ఏ విధమైన చర్య తీసుకున్నదో తెలియకుండా ఉన్నది. అనంతపురం జిల్లాలో ఏ రైతును అడిగినా ప్రతిపంట పండినా లేదా అంటే ఏమాత్రం లేదనే సంగతి స్పష్టంగా తెలుస్తుంది. ఉద్యోగులు కూడా ఆ విషయమై సిఫారసులు చేశారు. చట్టంలో ఏ సంవత్సరంలోనైనా వర్షం లేకపోవడంవల్లకాని ఏ ఇతర కారణం వల్లనైనా పంట దెబ్బతింటే special assessment 1-0-0 తగ్గించడానికి ప్రభుత్వానికి అధికారం ఇస్తూ ప్రత్యేకమైన క్లాజు ఉన్నా ఈ విషయమై ఏమీ ఉత్తరువులు ఇవ్వకపోవడం చూస్తే ప్రభుత్వం సరియైన శ్రద్ధ తీసుకుంటున్నదా అనే విషయమై అనుమానం కలుగుతుంది. గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా కోసమై ప్రభుత్వం బాగా కృషి చేస్తోందని చెప్పారు. ఇది అంత నిజమైనమాట కాదేమో అనుకుంటాను. 1953 అక్టోబరు నెలనుంచి ఈనాటి వరకు చూస్తే బడ్జెటులో విద్యుచ్ఛక్తి విస్తరణకు కేటాయించే మొత్తం ప్రతి సంవత్సరం తగ్గుతున్నదనే విషయం స్పష్టం అవుతుంది. 1953 అక్టోబరు నెలనుంచి 1954 నవంబరు నెల వరకు విద్యుచ్ఛక్తి విస్తరణ ఎంతగా జరిగినదో ఈ నాలుగు సంవత్సరాలు అంతగా కూడా జరుగలేదనే విషయాన్ని ప్రభుత్వం గుర్తించుకోవాలని తమ ద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను. కేవలం percentage of returns దృష్టిలో పెట్టుకుని 10 % రివెన్యూ వస్తేనే కాని అమలు చేయకూడదని అంటూ 10 % కు మించిన return వచ్చే స్కీములను కూడా అమలుచేయకుండా ఉండడం జరుగుతున్నది. Investigate చేసి పంపిన స్కీములను అమలు చేయకుండా ఫైల్సులో పెట్టుకుని ఉండడం చూస్తే investigate చేసిన డిపార్టుమెంటు ఉద్యోగులకే కాకుండా మాబోటి వారికి కూడా నిరుత్సాహం కలుగుచున్నది. ప్రభుత్వం మైసూరు, మద్రాసు రాష్ట్రాలతో మాదిరిగా, విద్యుచ్ఛక్తి సరఫరావిషయమై ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని తమద్వారా మనవి చేస్తున్నాను.

*Mr. Chairman* :- There are 9 more Members to speak. The hon. Members will restrict their speeches to seven minutes each.

శ్రీ పి. రాజగోపాల నాయుడు :— (తవనంపల్లి) అధ్యక్షా గా॥ సభ్యులు శేషాద్రిగారు చెప్పిన విషయములతో నేను సంపూర్ణముగా ఏకీభవిస్తున్నాను. సాధారణముగా ప్రభుత్వము తాము చేస్తున్న పనులు ఏమిటి, రాష్ట్రములో ఎక్కడెక్కడ క్లిష్ట పరిస్థితులు పరిణమించివున్నవో ప్రజలు ఏయే బాధలు ఎందువలన పడుతున్నారో మొదలగు విషయములు తెలుసుకొని ప్రజలకున్న కష్టాలను తొలగించవలసిన బాధ్యత ప్రభుత్వముపై వున్నది. ప్రజలకు సరియైన రక్షణకలిగించ వలసిన బాధ్యతకూడా ప్రభుత్వమునకు వున్నది. పైవిషయములను గురించి గవర్నరుగారు ప్రసంగములో ప్రస్తావించక పోవడం చాలా శోచనీయముగా వున్నది.

శ్రీ శేషాద్రిగారు చెప్పినట్టుగా వర్షాలు సరిగా పడకపోవడమువల్ల రాయలసీమలోని కొన్ని ప్రాంతాలలో పంటలు పండలేదు. మరుసటి పంటకూడా వేయడానికి వీలులేకుండా పోయినది. పశువులకు గడ్డి లేకుండా పోయినది. చాలా విపరీతమైన పరిస్థితులు రాయలసీమ ప్రాంతములో యేర్పడినవి. శ్రీ కళా వెంకటరావుగారు మొన్నను చిత్తూరు వచ్చినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ఎవరిని తిండి లేకుండా చావ నివ్వము అని చెప్పినారు. గాని ప్రజలకు కావలసినది చావ నివ్వకుండా వుండడము కాదు. ప్రజలు ఉన్న బాధలను తీర్చే బాధ్యత కూడ ప్రభుత్వానికి వున్నది. చావ నివ్వకుండా ప్రాణాలతో మిగుల్చడము కాదు. ఇంతకు ముందు 4 యేండ్ల క్రితం ఒకసారి కరువు వచ్చినది. ఆ కరువు సమయములో ప్రభుత్వము వారు 400 గంజి కేంద్రాలు ప్రవేశపెట్టి ప్రజలను చావనివ్వకుండా చూచినారు. ప్రజలు బ్రతికవుండి కష్టపడుతూ వచ్చేగానికి కూడ వీలులేకుండా అయిపోయినది. అటువంటి దుర్భర పరిస్థితులు యీనాడు లేకుండా చూడాలి. వెనువెంటనే యీ విధమయిన క్షామ పరిస్థితులు యేర్పడడానికి ఆవకాశములేకుండా ఏమి చర్యలు ప్రభుత్వము తీసుకొనబోవుచున్నది. ముఖ్యమంత్రిగారు ఒక statement యివ్వవలెనని నేను కోరుతున్నాను. రెండవది విద్యుచ్ఛక్తి విషయములో 11% పెట్టినారు. అందువల్ల రాయలసీమ ఏరియాలో ఎక్కడగాని విద్యుచ్ఛక్తిపథకాలు అమలు జరపడానికి వీలులేకుండాపోయినది. దీనికి ముఖ్యకారణము ఏమిటంటే, ఒక horse powerకు 35 రూపాయలు రిటర్న్ రావాలని చెప్పి లెక్కలు వేసినారు. అలాగ లెక్కలు వేసుకొనడమువల్ల వారికి 11% రిటర్న్ రావడములేదని చెబుతున్నారు. కాని Electricity Department అధికారుల లెక్కలు ప్రకారము వ్యవసాయానికి ఇస్తూండేటటువంటి విద్యుచ్ఛక్తికి ఒక horse power కు 49 రూపాయిలు వస్తున్నప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో average లెక్కలు ప్రకారము 35 రూపాయలు రావచ్చునని చెప్పి లెక్కలు వేసుకొని, 10% లేక 11%కంటె తక్కువగా వస్తున్నదని చెప్పి విద్యుచ్ఛక్తిని వ్యవసాయమునకు సరఫరా చేయడానికి పరిస్థితులేమాత్రము బాగాలేదని ఆ పథకములను అమలుపరచడానికి వీలు లేకుండా చేయడము చాలా శోచనీయముగావున్నది. కాన యీ విషయములో సమగ్రమయిన విచారణ జరిపించాలని నేను కోరుచున్నాను. సరాసరి 49 రూపాయలు వస్తున్నప్పుడు anticipated revenue వస్తున్నది. కాబట్టి ఆ లెక్కలు ప్రకారము ఒక స్కీమును వేసి, 11% ఏలాగైన వస్తున్నది కాబట్టి వెనువెంటనే schemes అన్నియు sanction చేయించాలని ప్రభుత్వమును కోరుచున్నాను. ఒక వేళ స్కీములన్నీ sanction చేయించడానికి వీలులేక పోయినట్లయితే 11% నుంచి 8% కు తగ్గించాలని నేను కోరుచున్నాను. అలాగుననే Land revenue Reforms Committee ఒకటివేసి యున్నట్లున్నూ revenue rationalisation గురించి వారు ఆలోచిస్తు ఉన్నట్లున్నూ ప్రకటించినారు. వారి పరిపాలన యే basis మీద చేస్తున్నారో చెప్పాలి. ఇంతకుముందు Central Government

వారు ఒక Taxation Enquiry Committee వేసినారు. వారు వసూలు కాబడుతున్న పన్నులలో యేయే పన్నులు యింకా అధికము చేయవచ్చు, యింకా పన్నులు క్రొత్తగా వేయవలసిన వస్తువులు యేవి, మొదలగు విషయాలను చర్చించి చివరకు ప్రభుత్వమునకు రాబడి అధికమయ్యే సూచనలు చేసినారు. వారిపరిశీలన ఆ విధముగా వున్నది. అలాగే అనంతరామన్ కమిటీ యిక మీదట ఏవైన మిగిలిఉన్న పన్నులు రాబట్టడానికి ప్రయత్నిస్తుందేగాని పన్నులలో యున్న ఉచితానుచిత ములను గమనిస్తుందా? అని అనడానికి సందేహముగా వున్నది. ఆ విధముగానే ప్రభుత్వమువారు వాణిజ్య పంటలుపై పన్నులు అపరిమితముగా వేసినారు. దానివల్ల ప్రజలలో ప్రభుత్వముమీద ఒకవిధమయిన వ్యతిరేకత యేర్పడుతున్నదనే విషయమును ప్రభుత్వము యెంత త్వరగా గుర్తిస్తే అంత మంచిదని నేను ముఖ్యమంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. వ్యాపార పంటలపై యిప్పుడు వేసిన పన్నులను తప్పకుండా రద్దుచేయమని నేను కోరుచున్నాను. బస్సులను జాతీయము చేసినట్లు చెప్పినారు. చాలా సంతోషకరమయిన విషయము. గాని యికమీదట జాతీయము చేయబోయేముందు ఎలాంటి principle ను ప్రభుత్వము అనుసరింపనున్నదో గవర్నరుగారు తమ ప్రసంగములో ప్రస్తావించక పోవడము చాలా శోచనీయముగా ఉన్నది. ఒక క్రమపద్ధతిలో యీ జాతీయము జరుగకపోతే ప్రజలలో చాలా అనుమానాలు కలుగడానికి అవకాశము ఏర్పడుతుంది. మరొకవిషయమేమిటంటే, బస్సురూట్ల పంపకము విషయములో యీ మంత్రులు జోక్యము కలిగించుకుంటున్నారని చాలా తతంగాలు చేస్తున్నారని ప్రజలలో వదంతి ఉన్నది. ఈ విధమయిన జోక్యము కలిగించుకొనుటవలన మంత్రివర్గమునకు చాలా అప్రతిష్ట కలుగుతున్నది. కాబట్టి యీ విధమయిన జోక్యమును మంత్రులు కలిగించుకొనకుండా చూడాలని ముఖ్యమంత్రిగారిని నేను కోరుచున్నాను. Sugar Factories స్థాపించే నిమిత్తము Co-oparatiue Credit Socetics తరఫున చాలా డబ్బు వసూలుచేసినారు. 10 లక్షలు రూపాయలు వరకు చిత్తూరులో వసూలు కాబడినది. ఆవిధముగానే యితర ప్రాంతాలలో కూడ 10 లక్షలు వరకు వసూలు చేసినారు. యిప్పటికే 2 సంవత్సరములు అయింది. మరొక రెండు సంవత్సరములకు గాని దాని స్వరూపము కనబడేటట్లుగా లేదు. 100 రూపాయలు share తీసుకొన్నవారు 20 రూపాయల వడ్డి పెట్టవలసి వస్తున్నది. అంటే 125 రూపాయలు ఖర్చు పెట్టినట్లవుతుంది. ఈ విధముగా సామాన్య ప్రజానీకము, చిన్న రైతాంగము పెట్టిన డబ్బుకు, వడ్డికట్టవలసి వస్తే, ఎంత నష్టపడవలసి వస్తుందో ఆలోచించమని ముఖ్యమంత్రిగారిని కోరుతూ ప్రభుత్వము సాధ్యమైనంత త్వరలో యీ factories స్థాపించాలని చెబుతున్నాను. విద్యావిషయమునకు సంబంధించినంతవరకు చూస్తే చిత్తూరులో కళాశాలలేదు. సాధారణముగా

అన్ని జిల్లా కేంద్రాలలో కళాశాలలు స్థాపించి ఆయాజిల్లాల ప్రజలకు విద్యా సౌకర్యములను కలిగించవలసిన బాధ్యత ప్రభుత్వముపై ఉన్నది Mahaboob Nagar జిల్లా కేంద్రము అయినప్పటికి నీ అక్కడకూడా కళాశాల లేదు. ... రెండు సంవత్సరాలలో వెంటనే కళాశాలలు యేర్పరచవలెనని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఇక పరిశ్రమలకు సంబంధించినంతవరకు ... కుటీర పరిశ్రమలు గురించి యీ ప్రసంగములో ... ఎలాంటి వ్యాపార సంస్కరణలు అయినా తీసుకొని రానివ్వండి ఎలాంటి ... కరణం అయినా తేవచ్చు. ... ప్రజలకు, సామాన్య ప్రజలకు, రైతులకు కావలసిన ఆ యాన్ని వృద్ధిచేసే మార్గము కనుపించుటలేదు ... కావలసిన పరిస్థితులు కల్పించుటలేదు కుటీరపరిశ్రమలలో యే విధముగా అమలు జరుప బోతున్నారో దానిని యే విధముగా అభివృద్ధి చేయ తలచుకున్నారో మొదలగు విషయములు గురించి ఆలోచించనే లేదు పైగా కుటీరపరిశ్రమలు స్థాపించుటకు కావలసిన సౌకర్యములు మన Industries Department లో కూడ లేదు ఇది చాలా విచారకరమయిన విషయము. ఈ విషయములో ప్రభుత్వము తప్పకుండా శ్రద్ధవహించాలని నేను కోరుచున్నాను. Labour Policy evolve కాలేదని చెబుతున్నాను ఎందువల్లనంటే. యింతవరకు factory owners గాని bus owners గాని కార్మికులలో చేసుకొన్న agreements ను అమలుపరచినట్లుగా లేదు. ఆ విధముగానే Labour Awards ను యింతవరకు అమలుపరచినట్లుగా కనిపించదు. ఈ విధముగా agreements గాని awards గాని అమలు పరచకుండా వున్న పెట్టుబడి దారులను బస్సు యజమానులను ప్రభుత్వము తప్పనిసరిగా నిర్బంధించి, వాటిని అమలు పరచేటట్లుగా ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకుని దానికి సంబంధించిన విధానాన్ని అనుసరించాలని, ఆ విధానాన్ని తప్పనిసరిగా వారు అమలు జరిపేటట్లు చూడాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

శ్రీ బి. కేశవరెడ్డి (ఘనపూర్):- ఈనాడు గవర్నరు గారి ప్రసంగముమీద జరుగుతున్నటువంటి చర్చలవిషయమై ఒకటి రెండు points నేనుకూడ యీసభ ముందు చెప్పదలచుకున్నాను ఈ ప్రసంగము చూచిన తరువాత గవర్నరు గారు కేవలము ఒక్క Land Reforms విషయమై reference యిచ్చినారేకాని, అదితప్పితే యిందులో మరొకవిషయము గమనించదగినది ఏమీలేదనిచెప్పడానికి నేను సాహసిస్తున్నాను. బిల్లుపత్రికలో జరిగిన తరువాత చూచాము. నాకుతెలిసినంతవరకు దీనిని భూసంస్కరణల బిల్లు అన్న దానికి బదులు దానిని భూస్వాముల బిల్లుఅనిఅంటే చాలా బాగుంటుందేమో ఆలోచించవలసినదిగా నేను ప్రభుత్వమును కోరుచున్నాను. భూసంస్కరణలుఅంటే వ్యవసాయోత్పత్తి, అభివృద్ధిచేయడానికి అనేక రంగాలలో అనేకవిషయములను

సమగ్రముగా ఆలోచించవలసివుంటుంది. అనేక విషయములు ఆబిల్లులో పొందు పరచాలి. రేపు రాబోయే బిల్లులోవున్న ఇటువంటి 30 clauses కూడ కేవలను సీలింగుమీదనే ఆధారపడివున్నవి. ఒక్క సీలింగు చేసినంతమాత్రాన యీ భూ సంస్కరణలవలన మనప్రజలకు యేమిమేలుకలుగుతుందో నేనుచెప్పలేకుండా ఉన్నాను. ఈ విషయము లన్నింటిని సక్రమముగా ఆలోచించడానికి రేపు రాబోయే చర్చలలో నాకు అవకాశము కలిగిస్తారని ఆశించుచున్నాను. Electricity కి సంబంధించినంతవరకు తెలంగాణా పరిస్థితులగురించి తను ముందు నేను కొన్ని విషయములు మనవిచేయదలచుకున్నాను. తెలంగాణాలో యీమధ్యను తాలూకా కేంద్రాలకు మాత్రమే కాకుండా యితర ముఖ్యగ్రామాలకుకూడ విద్యుచ్ఛక్తి సప్లయిచేయబడుచున్నది. కాని కేవలము ఆ సప్లయి వీధులలోదీపాలు వెలిగించడానికి లేకరయే కొద్దిపాటి గృహాలలోనో దీపాలు పెట్టడానికి సరిపోతున్నది. కాని వ్యవసాయదారులకు విద్యుచ్ఛక్తి సరఫరాచేయుటలేదు. కేవలము వీధులలో దీపాలు వెలిగించినంతమాత్రాన గ్రామాలలో నివసించే ప్రజానీకానికి ఎక్కువ సహాయముజరుగుతుందని అనుకోవడము చాలాపొరపాటని మనకందరికి తెలుసును. ఎంతవరకుఅయితె గ్రామాలలోవున్న రైతాంగానికి వ్యవసాయము విషయములో విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతున్నదో అంతవరకుమాత్రమే వారికి సహాయము జరుగుతున్నట్లుగా ఉన్నదన్న విషయాన్ని ప్రభుత్వము గుర్తిస్తుందని, ఆశుభదినము కొరకు మనము వేచివుండకతప్పదని నేనుఅనుకుంటున్నాను. ఈ మధ్య నే agricultural production విషయమై Pandit Jawharlal Nehru గారు శ్రద్ధగా రాష్ట్రప్రభుత్వములకు కొన్నిఉత్తరములు వ్రాశినారని పత్రికాప్రకటన జరిగెను. Agricultural Production ఎక్కువ చేయడానికి States లో ఏమియు అభివృద్ధికరములైన పనులు జరగలేదన్న అభిప్రాయమునకు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు వచ్చినారు. అందుకని ఉత్పత్తి ఎక్కువచేయడానికి ఆయారాష్ట్రాలలో ముఖ్యమంత్రులే వ్యవసాయ శాఖలను నిర్వహిస్తే బాగుంటుందన్న అభిప్రాయము వెలిబుచ్చుతూ ఒకసూచన చేసియున్నారు.

మన ప్రభుత్వము యీవిషయాన్ని గ్రహించి ముఖ్యమంత్రిగారు కొంతతీరిక చేసుకొని వ్యవసాయశాఖను నిర్వర్తించడానికి పూనుకొంటే బాగుండునని నాఅభిప్రాయము. కాని దానికిగాను నాదిఒక చిన్నసలహావుంది. దానితోపాటు వ్యవసాయానికి తోడ్పడే Minor Irrigation Electricity శాఖలుకూడ వారే స్వీకరించాలని కోరుతున్నాను. పండిట్ జవహర్‌లాల్ అభిప్రాయపడుతున్నట్లు ఉత్పత్తిని ఎక్కువజేయుడానికి వీలుఅవుతుంది గనుక, యీవిషయాలను సాధారణము ఆలోచించాలని కోరుతున్నాను. Road Transport విషయము గవర్నరుగారు పేర్కొన్నారు. ఈ విషయము విన్నంతమాత్రాన మెచ్చుకొనదగిన విషయమే. Road Transport జాతీయకరణచేయడము ఒకగొప్పవిషయమే. ఏవిధమైనగా జాతీయకరణ

Bank of India ఎక్కువడబ్బు యివ్వడానికి సిద్ధముగాలేదు. Rural Credit Banks ను అభివృద్ధిచేయడానికి ప్రభుత్వం సహకారం యివ్వాలి. డబ్బు రూపేణా, subsidy రూపేణా, State Participation రూపేణా Banks కు డబ్బుఇవ్వాలి. నాకు తెలిసినంతవరకు రాయలసీమలోకూడ ఇటువంటిపరిస్థితి ఒకసారివచ్చింది. అప్పటి ప్రభుత్వము కొన్నిలక్షలరూపాయలు సబ్సిడీగా ఇచ్చింది. తెలంగాణా చాల వెనుకబడినప్రాంతము. దానికి ఎందుకుఇవ్వ కూడదు? ఈ పరిస్థితిని గ్రహించి ప్రభుత్వం subsidy రూపేణా డబ్బు వీటికియివ్వా లని కోరుతున్నాను

శ్రీ బసవమానయ్య (ఆంధోల్) - అధ్యక్షా, గవర్నరు గారిచ్చిన ఉపన్యాసములో మనఆంధ్రప్రదేశ్‌కు ప్రగతియుక్తమైన, అవసరమైన మార్పులు ఏమిలేవని విచారించవలసి వున్నది. భూసంస్కరణలను గురించి వారు తెలిపారు. ప్రభుత్వము ప్రకటించిన బిల్లునుచూస్తే దీనివల్ల రైతులకు ఏమైనా ప్రయోజనముందా అంటే కరిమింగిన వెలగపండువలెనున్నది. హైదరాబాద్ ప్రభుత్వమే 3600 రూపాయలు గరిష్టపరిమితి పెట్టితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము కుటుంబ క్రమతముగా 5400 పెట్టుచున్నది. తెలంగాణా ప్రాంతాలు, గోదావరి జిల్లాలు లాంటివి కావు, ఈ సంస్కరణలు రైతుకు ఏవిధముగాను లాభదాయికనుగా లేవు. పంచాయతీ సమితులకు అధికారాలు ఇస్తున్నాము అని చెపుతున్నారు. వాటిని గురించి ప్రాతినిధ్యము తీసుకొంటున్నామని చెపుతున్నారు. కాని యిష్టమువచ్చిన వారిని అధ్యక్షులుగా తీసుకొన్నతరువాత వారుచేయబోయే కార్యక్రమము అంది వది. ఎన్నికలు తరువాత ఆ కార్యక్రమమును ఇచ్చింది మొదటి పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన విషయాలు గారడీగా చెప్పడంజరిగింది. మెదక్ జిల్లాకు సంబం ధించిన దేవనూరు ప్రాజెక్టు మొదటి పంచవర్ష ప్రణాళికతో ప్రారంభమైనది. రెండవ పంచవర్షప్రణాళిక నడుస్తున్నా ఇంకా అది ఓనమాలుదశలోనేవుంది. తెలం గాణా ప్రాజెక్టులగురించి ఏవిధమైనచర్యలు వారుతీసుకొనలేదు. మనం ముందుకు పోతున్నాము, ఆహారోత్పత్తి ఎక్కువచేస్తున్నాము, అని చెపుతున్నారు. ప్రతి సంవత్సరం 2, 3 రూపాయిలువుండే గడ్డిమోపు ఖరీదు ఈసంవత్సరము 5 రూపా యల వరకు అమ్ముతున్నది. గత 10 సంవత్సరములలో ఎప్పుడూ ఇంతటి ఖరీదు లేదు. ఎన్నోప్రాజెక్టులుఅయ్యాయి అనిచెప్పే ఏనుగుదంతాల విధానమువల్ల రైతులకు ప్రజలకు ప్రయోజనమేమాత్రము వుండదని దీనివల్ల బోధపడుచున్నది. భారీ పరి శ్రమలను గురించి చెప్పవలసివున్నది. పుస్తకాలు, "సంభాషణల ఆనందమే కాని ఎక్కడ పరిశ్రమలువున్నాయి. ఎంత ఉత్పత్తిచేస్తున్నాయి అనేది చూస్తే ఫలితము ఏమీకనబడదు. సామాన్యమానవుని జీవితానికి అవసరమైన వస్తువులు తక్కువధరలో సరఫరాచేయుటకు అవకాశములు కల్పించిననాడే భారీ పరిశ్ర మలలో మహత్తరమైన మార్పు వచ్చిందని అనుకొనవచ్చును. తెలంగాణాకు

సంబంధించిన విషయాలు సభముందు అనేకమున్నవి. తెలంగాణాకు సంబంధించిన మంత్రులు సభలోవుండి అవసరములను తెలుసుకోవడను తెలంగాణా ప్రజల సంపిద. వాటిని పరిష్కరించే మార్గములు అవలంబించాలి. లఘు పరిశ్రమలకు ఎంతగా సాయము చేస్తున్నది ఆలోచించవలసిన విషయము.

నీటిపారుదల పథకములను ఎన్నింటినో అమలు పర్చదలచినట్లు గవర్నరుగారి ప్రసంగంలో పేర్కొన్నారు. మాఆంధోలు తాలూకాలో 50, 60 చెరువులకు గండ్లు పడడంవల్ల సకాలంలో భూములకు నీరు అందక పంటలు చెడిపోతున్నాయి. ఎన్నిసార్లు వాటిని బాగుచేయించమని ప్రభుత్వమువారికి తెలుపుకున్నా వారు వినిపించుకోవడములేదు. ఇట్టిపరిస్థితులలో ఆధికాహారోత్పత్తి ఎలా సాధించగలమని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను.

ఎన్నో గ్రామములకు ఈనాటివరకు పంచాయితీలు ఏర్పాటుకాలేదు. 5, వేల జనాభా ఉన్నవాటికికూడా నేటివరకు కొన్నిచోట్ల పంచాయితీలు లేవంటే అది చాలాశోచనీయమని చెప్పాలి.

రోడ్ రవాణాసౌకర్యములు తెలంగాణాప్రాంతములో దుర్భర స్థితిలో ఉన్నాయి. చాలాచోట్ల గండ్లుపడి ప్రయాణానికి అనువైన స్థితిలోలేవు.

ఇక విద్యవిషయం చూడండి. మాజోగిపేటలోని మిడిల్-కం-హైస్కూలు ప్రైమరీస్కూలుకు అనువైన బిల్డింగులో నడుస్తున్నది. ఇక విద్య ఏస్థాయిలో వుంటుందో ఊహించుకోవలసివున్నది. నర్సాపురంతాలూకా దౌలతాబాద్ గ్రామములో మూడువేల జనసంఖ్య ఉన్నది. ఇచ్చటి ప్రైమరీస్కూలు యీనాటికి ఒక అద్దెఇంట్లోనే వుంటున్నది. వెనుక జాగీరుదారుల కాలములో విద్య ఏస్థితిలోవున్నదో నేటికి అదేస్థితిలో ఉన్నదని చెప్పడానికి విచారిస్తున్నాను. తెలంగాణాప్రాంతం ఆంధ్రప్రాంతంకంటె ఎంతో వెనుకబడియున్నది. ట్రెయిండ్ టీచర్లు కావలసివున్నారని మంత్రిగారు చెప్పుచున్నారు. అయితే పోయినసంవత్సరం ట్రెయినింగ్ నిమిత్తం కేటాయించినడబ్బును ఎందుకుఖర్చుపెట్టలేదు అనిఅడిగితే అది అటువుండనీలే, అంటున్నారు. ఈ విధంగా పరస్పర విరుద్ధ భావాలతో సహృదయ రాహిత్యంగా వ్యవహరిస్తూవుంటే విద్యాభివృద్ధికావడం ఎలా, తెలంగాణా ముందుకుపోవడం ఎలా అని సందేహించవలసి వస్తున్నది.

ఇక సహకార సంఘాలవిషయం తీసుకుందాం. వెనుకటి హైదరాబాదు ప్రభుత్వం గ్రామాలలో గ్రైన్‌బ్యాంకులను స్థాపించినది. మణుగుకు 5 శేర్లు చొప్పున హెచ్చుతీసుకున్నారు. పటేలు పట్వారీలు ఈ గ్రైన్‌బ్యాంకులకు అధినేతలుగా ఉంటున్నారు. మాల్గకొలదిపుట్లు మింగివేయడం జరిగింది. అట్టివారిని ఈ

ప్రభుత్వం ఏమిచేసినది? ఒకబీదవాడు జన్మలో కోడి రుచిచూద్దామని దొంగతనం చేస్తే బేడీలువేసి తీసికొనిపోతారు యీ ప్రభుత్వంవారు. కాని పటేలు, పట్వారీలు జాగీరుదారులు ప్రైయిజ్ బ్యాంకులకు అధ్యక్షులుగా ఉంటూ నూర్ల పుట్ల ధాన్యాన్ని మింగివేస్తే అడిగే దిక్కులేదు. ఇది దొంగతనంకాదా? తప్పుకాదా? అట్టివారు ప్రజాప్రభువులు కారా? ఈ విషయాలన్నీ ప్రభుత్వమువారు గుర్తించాలి. గవర్నరుగారు చెప్పేమాటలకు గ్రామాలలోని పరిస్థితికి సంబంధము, సమన్వయం కనబడడంలేదు. ఇచ్చట ప్రదర్శిస్తున్న వేషభాషలు, డాన్సులు జరుపుతున్న ఊరేగలు, విందులు పల్లెప్రాంతాలలో జరగాలి. గవర్నరుగారు మన ముందు ఈ చెప్పే యీమాటలు గ్రామప్రజలముందు చెప్పాలి. తిండికిలేక డొక్కలు ఎండిపోయి బక్కచిక్కిన కర్షకుల ఎదుట, కూలీల ఎదుట, యీ మాటలు చెబితే పరిస్థితి ఎంతహీనంగావుందో అందరకు బోధపడుతుంది. మంత్రులుగాని గవర్నరుగాని గ్రామప్రాంతాల్లోని స్థితిగతులను దృష్టియందుంచుకొని వారి విధానాలను రూపొందించుకోవాలని కోరుతున్నాము. ఇక మద్యపాననిషేధం విషయంచూడండి. మద్యపాననిషేధం కావలెనని మంత్రి రంగారెడ్డిగారు ఎన్నో సార్లు చెప్పారు. ఎప్పుడొస్తుందానిషేధం? గాంధీభక్తులు ఏమిచేస్తున్నారు? దీని విషయం ఎంతో శ్రద్ధతో ఆలోచించవలెనని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఉద్యోగస్థులకు పార్టీలతో ప్రమేయం లేదంటున్నారు. నిజమేకావచ్చు. ఈ విషయంలో కొందరిమిత్రులలో మేమేకీభవించలేకపోతున్నాము. పేకాటలు, త్రాగుడు, వ్యభిచారము మొదలైన సౌకర్యాలు కలిగించేవారికే వారు అవకాశాలిస్తారు. ఇది నిజమైనసంగతి.

మిస్టర్ స్పీకర్: ఏమిటి ఆ నిజమైన సంగతి?

శ్రీ బసవ మానయ్య: కొందరు అధికారులు వారి స్వార్థ దుర్వినియోగాలకు సంబంధించిన ఆలవాట్లకు సహకరించే కార్యకర్తలకే సహకరిస్తున్నారు. ఈవిధంగా అధికారం దుర్వినియోగం జరుగుతోంది. ఇది లంచగొండితనమో, మరొకటో, ప్రభుత్వమే గుర్తించాలి.

కేరళలో శాంతి భద్రతలు లేవని అశాంతి ప్రబలిందని ప్రజల ధన మాన ప్రాణాలకు రక్షణలేదని పత్రికలలో ప్రతిరోజు చూస్తూనేఉన్నాము. ఐతే మనరాష్ట్రములో అందుకు భిన్నంగాఉన్నదని నేను అనుకోవడంలేదు. మిత్రులు శ్రీ కృష్ణావతారంగారు చెప్పిన విషయములనుబట్టి చూచినట్లయితే దొంగతనాలు డెకాయిటీలు జరుగుతున్నట్లూ, అడిగేదిక్కు లేనట్లు తెలుస్తున్నది. అట్టిపరిస్థితిలో కేరళలోకన్న మనరాష్ట్రంలోనే ఎక్కువ అరాజకం ఉన్నదని నాఅభిప్రాయం.

శ్రీ వి. విశ్వేశ్వరరావు:-అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగం ఆశాజనకంగా లేదని చాలమంది సోదర సభ్యులు నిరాశను వెల్లడించారు. గవర్నరుగారు ఆహార

సమస్యపై ప్రస్తావిస్తూ, "The actual, additional production during last year was 2·08 lakh tons" అని అన్నారు గవర్నరుగారికి యీ అంకెలు ఎలా వచ్చాయో అర్థం కావడంలేదు. ప్రభుత్వంవారు ప్రచురించిన ఎకానామిక్ అండ్ స్టాటిస్టిక్స్ బులిటెన్ బట్టి గత సంవత్సరం కన్నా యీ సంవత్సరం ఆహారోత్పత్తి శాతము తగ్గినట్లు బుజువౌతున్నది. 1956-57 సం.లో 2706 లక్షల టన్నుల ధాన్యము ఉత్పత్తి అయితే 1957-58 సం.లో 2456 లక్షల టన్నులు మాత్రమే ఉత్పత్తి అయినట్లు చెప్పబడింది. ఆ బులిటన్‌లో ఇలాఉన్నది.

"In Krishna certain varieties of crop were reported to have been affected by plant diseases like 'Stem Borer, while in Srikakulam and Cuddapah it was reported to have been affected for want of rains In Khammam and Nalgonda districts 'Dumpa Rogam' was prevalent to some extent. The harvested produce was reported to be fair in Visakhapatnam, East Godavari, Kurnool, Guntur and Srikakulam but it was reported to be poor in Cuddapah.

దీని ప్రకారంగా 8 పర్సెంటు పంట తగ్గింది. కాని గవర్నరుగారి ప్రసంగంలో ఆహారోత్పత్తి అధికమయినదని అనడం చూస్తే ఇది కేవలం ఏదో కాగితాల మీద లెక్కలు చూపించడానికి మాత్రమే జరిగినదని అనుకోవలసవస్తున్నది. వర్షాలు లేక పంటలు పాడైనవని తెగుళ్ళవల్లకూడా పంటలు నష్టపడ్డాయని ఒకవంక చెబుతూ వేరొక వంక అధిక ఆహారోత్పత్తి సాధిస్తామనడం పరస్పరం విరుద్ధంగా ఉంది. రాయలసీమ, నెల్లూరు, శ్రీకాకుళం జిల్లాలలో కొన్ని ప్రాంతాలు కరవు ప్రాంతాలుగా ఉన్నాయి. ఇట్టి పరిస్థితులలో కూడ ఆహార స్థితి సక్రమంగా ఉన్నదనిచెప్పడం సక్రమంగా లేదు, ధరలు పెరగడంవల్ల సామాన్యప్రజల పరిస్థితి దుర్భరంగా ఉన్నది. కార్మికులకు వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు యీనాటికీ నిర్ణయించ లేదు వెంటనే కనీస వేతనాలు నిర్ణయించవలెనని కేంద్ర ప్రభుత్వంవారు చెబుతున్నప్పటికీ కూడా ఆ పనిలో ప్రభుత్వం తగినంత శ్రద్ధ చూపడంలేదు. నిజామాబాదు జిల్లాలోను ఆంధ్ర ప్రాంతంలోని 7 గ్రామాలలోను కనీసవేతనాలు వ్యవసాయ కూలీలకు నిర్ణయిస్తున్నామని చెప్పడం కేవలం కళ్లనీళ్లు తుడవడానికి మాత్రం చెబుతున్నారు కార్మికులకు యిస్తున్న జీతాలు చాలా తక్కువగా ఉన్నాయి. కార్మికులకు ఎట్టి జీతాలివ్వవలయునో హనుమంతరావు కమిటీవారు సిఫార్సు చేశారు. ఆ కమిటీ రిపోర్టు తయారై సంవత్సరాలు దాటిపోయినా కనీసం దానిని ఇంతవరకైనా బయటపెట్టలేదు. గతనెల 15వ తేదీ ప్రాంతాన దానిలోని కొన్ని ప్రధాన సూత్రాలను అంగీకరిస్తున్నట్లుగా ప్రభుత్వం స్టేటమెంటు ఇవ్వడం జరిగింది. హనుమంతరావు కమిటీవారు నెలసరి జీతం 60 రూపాయలు సిఫార్సుచేస్తే ప్రభు

త్వంవారు ఇంటి అద్దెతోసహా 50 రూపాయలు మాత్రమే యిస్తామంటున్నారు. ఇంతేకాకుండా యీ కార్మికులలో అనేక తరగతులవారున్నారు. ఎన్. ఎమ్. ఆర్. లు డెయిలీ మస్టర్ రోల్సు అని ఎన్నో తరగతుల కార్మికులు యీ నివేదిక క్రిందకు రారని అంటున్నారు. మన రాష్ట్రములో ఉన్న 30 వేలమంది పారిశ్రామిక కార్మికులలో ఏ నాల్గవవంతు వారికి మాత్రమే యీ నివేదిక వర్తిస్తుంది. తక్కినవారికి ఎట్టి లాభము ఉండేటట్టు లేదు. నెలకు 15 రూపాయలనుంచి 25 రూపాయలవరకూ జీతాలు పుచ్చుకునే 4, 5 తరగతుల కార్మికులున్నారు. ఈ తరగతులను రద్దుచేసి వారి వేతనాలను రేషనలైజ్ చేయవలెనని ఎంతో కాలంగా కోరుతున్నాము. కాని దానిని ప్రభుత్వం పట్టించుకోవడం లేదు.

కాని ప్రభుత్వం యింతవరకు ఆ రిపోర్టును ప్రకటించడంగాని, కార్మికుల కోర్కెల పరిష్కారం విషయంలో స్పష్టమైన అభిప్రాయం ప్రకటించడంగాని చేయలేదు. ఈమధ్య కార్మిక నాయకులు కార్మికశాఖా కార్యదర్శిగారిని కలుసుకొమన్నారు. కలుసుకున్నారు. కార్మికుల కోర్కెల విషయంలో ఏదైనా పరిష్కారమార్గము సూచిస్తారేమోననుకుంటే, అది లేకుండా, ప్రభుత్వం యిచ్చిన కమ్యూనికేషను విశదీకరిస్తామనీ చెప్పారు. ఈవైఖరి మాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. 27 తేదీన సమ్మె చేస్తామని ట్రేడ్ యూనియన్ల తరపున 30 వేల మంది కార్మికులు పత్రిక విడుదలచేసియుంటే వాళ్ళకష్టాలు ఏ విధంగా నివారించాలో ప్రభుత్వం పట్టించుకొనకపోవడం చాల విచారకరంగా ఉన్నది. ఇంకొక విషయము చెప్పాలి. ప్రైవేట్ కార్మికులు 10 వేలమంది వరకు ఉన్నారు. వారు హనుమంతరావు కమిటీ రిపోర్టు క్రిందకు రారని చెబుతున్నారు. ఇంకా అనేకమైన డిపార్టుమెంటల్ డిస్ప్యూట్సు ఉన్నాయి. ఇవన్నీ adjudication కు పంపరు. తీర్పులు చెప్పరు. ఒకవేళ ఏవైనా awards యిస్తే వాటిని అమలు జరుపరు. ఉదాహరణకు విజయవాడలో సుదర్శన కంపెనీ ఉన్నది. ఆ మేనేజిమెంటు, అవార్డును అమలుజరుపుటలేదు. దానికి State Aid ఉన్నది. అనేక రూపాల్లో ప్రభుత్వం సౌకర్యాలు కలిగించింది. కాని వారు 67 మంది కార్మికులను పనిలోనుంచి తీసివేశారు. అది అన్యాయమని తీర్పు యిచ్చినా, దానిని అమలుజరపటానికి చర్యలు తీసుకొనుటలేదు.

కార్మిక సంఘాల విషయంలో కూడా ప్రభుత్వం పక్షపాతవైఖరి అవలంబిస్తోంది. కేంద్రప్రభుత్వంనుంచి అందరూ ఒక పరిశ్రమకు ఒకే యూనియన్ ఉండాలని చెబుతుంటే, మనమంత్రులు శాఖాలని కార్మికులను రెచ్చగొట్టి వేరే వేరే యూనియన్లు పెట్టించాలని ప్రయత్నిస్తున్నారు. యూనియన్లమీద దాడులు చేయించి వారిని కొట్టించేవరకు దిగడం జరుగుతోంది. సిర్ సిల్కు, కాగజ్ నగర్ ఫ్యాక్టరీలున్నాయి. అక్కడ కార్మికసంఘాలపైన ఈమధ్య రెండు మూడు నెలలలో 10, 12 సార్లు I.N.T.U.C. కార్మికులు దాడులు చేయడం, కొట్టడం

జరిగింది. కాని వాళ్ళ I.N.T.U.C. నాయకులు చేస్తే పే పట్టుదర్యా ఏమీ ఎక్కు తీసుకోవటం లేదు. అసలు I.N.T.U.C. లోనే రెండు ముఠాలు ఏర్పడి, (గాంధీ భవన లో కొట్టుకునే పరిస్థితులు వచ్చాయని పత్రికలలో చూశాను. ప్రభుత్వం ప్రత్యేకమైన ఒకటి I.N.T.U.C. నే చీల్చాలనే పరిస్థితికి వచ్చింది. ఈ ప్రభుత్వ విధానం మార్చి చీలగొట్టి, పరిపాలించాలన్నట్లుగా ఉన్నది.

జిల్లాలలో బ్లాక్ (Block) సమితులు పెట్టి పరిపాలనను వికేంద్రీకరణం చేయాలని, 3 Types పరిపాలన చేయాలని చెబుతున్నారు. కాని జరుగుతున్నదేమంటే ప్రభుత్వం తమ కాంగ్రెసు పక్షీయులలోనే పరిపాలన సాగించడానికి ప్రయత్నం చేస్తున్నది. నాకు ముందు మాట్లాడిన మిత్రులు చెప్పారు. తెలంగాణాలో నల్లగొండ జిల్లాలో బ్లాకు (Block) నిర్మాణం విషయమై, అక్కడ ఏ విధంగా కాంగ్రెసు పక్షీయులతో మంత్రివర్గ మువారితో నింపారో స్పష్టంగా చెప్పారు. ఇంకా ఉదాహరణలు చెప్పాలంటే జిల్లాలలో Irrigation Advisory Committees ఉన్నాయి. ఇదివరలో Irrigation Conferences అని జరుపుతుండేవారు అవన్నీ తీసేసి వాటి స్థానే Irrigation Advisory Committees ఏర్పాటు చేశామని చెప్పారు. అందులో M.L.A's ను Non-officials ను తీసుకుంటామని చెప్పారు. కాని కృష్ణా జిల్లాలో చూస్తే Irrigation Advisory Committee లో కమ్యూనిస్టు పక్షం వారిని కాక పోయినా, ప్రతిపక్షాలనుంచి ఒక్కరిని కూడా తీసుకోలేదు. దానిని మంత్రివర్గ పక్షీయులతోనే నింపారు. అలాగే కృష్ణా జిల్లాలో గన్నవరం బ్లాకుల్లో కూడ చేశారు. అది శ్రీ సుందరయ్యగారు ఎన్నికైన నియోజక వర్గం అయినప్పటికీ అక్కడ ఒక్క కమ్యూనిస్టును కూడా తీసుకోలేదు. ఇతరుల సహకారం కావాలని చెబుతూ ఎవరినీ తీసుకోకుండా తమ పక్షీయులలోనే ఎందుకు నింపుతున్నారో అర్థం కావడంలేదు. మంత్రిగారు చెప్పవచ్చు-G. O. లు ఉన్నవని. అట్లాగే చేస్తున్నామని చెప్పవచ్చును. కాని ఏదో పేరు పెట్టి వారి పక్షీయులనే తీసుకుంటున్నారు. కృష్ణాజిల్లా మునునూరు బ్లాకులో కూడ అదే విధంగా ఉన్నది. అన్ని పక్షాలవారికి సభ్యత్వం యివ్వాలని చెప్పినా ఇవ్వడం లేదు. తరువాత కృష్ణా జిల్లాలోనే ఇంకొక విచిత్ర సంఘటన గురించి చెబుతాను. ఒక కుర్రవాడు V.L.W. పరీక్షకు వెళ్ళాడు. అతని result యింతవరకు ప్రకటించలేదు. పాస్ అయినాడో fail అయినాడో చెప్పరు. ఉద్యోగమును యివ్వరు, ఏమిటయ్యా అంటే అతని తండ్రో, తాతో కమ్యూనిస్టనిగాని, కమ్యూనిస్టు అభిమాని అనిగాని యీవాడు యితనికి punishment యివ్వడం, result withhold చేయడం చాలా అన్యాయమైన సంఘటనగా ఉంది.

రాష్ట్రంలో విద్యావిషయం కూడా చాల దారుణంగా ఉంది. ఇంతకుముందు మిత్రులు చెప్పారు. స్కూలు బిల్డింగ్సు గట్టిగా లేవు. గోడలు కూలి ప్రమాదాలు

సంభవిస్తున్నాయి. గుంటూరు జిల్లా వేమూరులో స్కూలు పడిపోయి ఒక విద్యార్థి చచ్చిపోయాడు. 19 మందిని ఆస్పత్రిలో చేర్చారు.

అందులో ఒకస్కూలు పడిపోయి ఒకరిద్దరు విద్యార్థులు చనిపోయారు. కొంతమందిని ఆస్పత్రిలో చేర్చారు. ఈ ప్రమాదాలు జరగకుండా ముందుగానే ఎందుకు జాగ్రత్త తీసుకొనుటలేదు? Education Department నిద్ర పోతున్నదా? అక్కడవున్న Engineering Staff అది వారి బాధ్యత కాదని విడిచిపెట్టారా? Text Books విషయం చూసినా అల్లాగే ఉన్నది. ప్రభుత్వం శ్రద్ధ తీసుకొనుటలేదు. Elementary Education కు కావలసిన పుస్తకాలు supply కావడంలేదు. Publishers లేరా? Distributors లేరా? గత సంవత్సరం S. S L C Text Books విషయంచూస్తే, Text Books ను స్కూల్సులో అమ్మకుండా ప్రైవేటుగా Black Market లో అమ్ముకుంటున్నారని స్పష్టంగా పేర్లతో సహా మంత్రిగారికియిస్తే enquiry చేస్తామని నాతోచెప్పికూడా, యింతవరకు చేయలేదు. ఈవిధంగా ఆలస్యం వహించుటవల్ల education పడిపోతుందని, ఈనాడు పుస్తకాలుకూడ supply చేయలేని పరిస్థితులు వచ్చాయని తెలుపుతూ సెలవు తీసుకుంటున్నాను.

మిస్టర్ స్పీకర్; తిరిగి రేపుఉదయం 8-30 గంటలకు సమావేశమవుదాము. రేపు, ఎల్లుండి రెండురోజులు ఈచర్చ ఉంటుంది. (Interruption) 8-30 మొదలు 1 గంట వరకు కూర్చోందాము.

**The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 12th August 1958.**